అర్ఘ్యాన్ని కుడివైపుగానీ, ఎడమవైపుగానీ ఇవ్వకూడదు. ఆయనకి ఎదురుగా నిలబడి అర్ఘ్యప్రదానం చేయాలి. సూర్యుడికి ప్రీతికరమైన గుగ్గులుకర్ర, మారేడు, దేవదారు చెట్టు కర్రలతో చేసిన నలుపలకల ఆసనాన్ని సమర్పించాలి. తరువాత కర్పూరం అగరులతో ఆయనకి ధూపాన్ని వేయాలి. అలా చేసినవాడికి స్వర్గప్రాప్తి కలుగుతుంది.

రాత్రి పగలు సమానంగా వున్న రోజు సూర్యుణ్ణి అర్చిస్తే సకల దురితాలు నివారించబడతాయి. పులగం, పాయసం, ఆవుపాలు, పళ్ళు, దుంపలు, నెయ్యి సూర్యుడికి ప్రీతికరమైనవి. వీటితో ఆయనకి నైవేద్యం సమర్పిస్తే సర్వకామ్యాలూ సిద్ధిస్తాయి. ఆవునెయ్యితో సూర్యుడికి తర్పణం విడిస్తే సర్వసిద్ధులు కలుగుతాయి. ఆవుపాలతో తర్పణం చేస్తే మనఃస్తాపాలు హరిస్తాయి. ఆవుపెరుగుతో చేస్తే సకలకార్యసిద్ధి కలుగుతుంది. పవిత్ర జలంతో సూర్యుడికి స్నానం చేయిస్తే పరమపదం ప్రాప్తిస్తుంది. ఏ ద్రవ్యం సూర్యుడికి మనం సమర్పిస్తే ఆ ద్రవ్యం అనంతంగా మనకి ప్రాప్తిస్తుంది.

## సూర్యుడి అష్టోత్తర శతనామస్తోత్రం

ఓం సూర్యో ఒ ర్యమా భగస్త్వష్టా పూషా ఒ ర్కః సవితా రవిః ।
గభస్తిమా నజః కాఓ మృత్యుర్ధాతా ప్రభాకరః ॥

పృథివ్యాపశ్చ తేజశ్చ ఖం వాయుశ్చ పరాయణం ।
సోమో బృహస్పతిః శుక్రో బుధో ఒ ంగారక ఏవచ ॥

ఇంద్రో వివస్వాన్ దీప్తాంశుః శుచిః శౌరిః శనైశ్చరః ।
బ్రహ్మా విష్ణుశ్చ రుద్రశ్చ స్కందో వైశ్రవణో యమః ॥

వైద్యుతో జాఠర శ్చాగ్ని రైంధన స్తేజసాం పతిః ।
ధర్మధ్వజో వేదకర్తా వేదాంగో వేదవాహనః ॥

కృతం త్రేతా ద్వాపరశ్చ కలిః సర్వామరాశ్రయః ।
కలా కాష్ఠా ముహూర్తాశ్చ క్షపా యామా స్తథా క్షణాః ॥

సంవత్సరకరో ఽశ్వత్థః కాలచక్రో విభావసుః ।
పురుషః శాశ్వతో యోగీ వ్యక్తావ్యక్తః సనాతనః ॥

కాలాధ్యక్షః ప్రజాధ్యక్షో విశ్వకర్మా తమోనుదః ।
వరుణః సాగరోఽంశశ్చ జీమూతో జీవనో ఽరిహా ॥

భూతాశ్రయో భూతపతిః సర్వలోక నమస్కృతః ।
స్రష్టా సంవర్తకో వహ్నిః సర్వస్యా ఽఽది రలోలుపః ॥

అనంతః కపిలో భానుః కామదః సర్వతోముఖః ।
జయో విశాలో వరదః సర్వభూతనిషేవితః ॥

మనః సుపర్ణో భూతాదిః శీఘ్రగః ప్రాణాధారణః ।
ధన్వంతరి ర్ధూమకేతు రాదిదేవో ఽదితేః సుతః ॥

ద్వాదశాత్మా రవి ర్దక్షః పితా మాతా పితామహః ।
స్వర్గద్వారం ప్రజాద్వారం మోక్షద్వారం త్రివిష్టపమ్ ॥

దేహకర్తా ప్రశాంతాత్మా విశ్వాత్మా విశ్వతోముఖః ।
చరాచరాత్మా సూక్ష్మాత్మా మైత్రేయః కరుణాన్వితః ॥

ఏతద్వై కీర్తనీయస్య సూర్య స్యామిత తేజసః ।
నామ్నా మష్టశతం రమ్యం మయా ప్రోక్తం ద్విజోత్తమాః ॥

సురగణ పితృ యక్ష సేవితం । హ్యసుర నిశాకర సిద్ధవందితం ।
వరకనక హుతాశన ప్రభం ప్రణిపతితోఽస్మి హితాయ భాస్కరమ్॥

బ్రహ్మ దేవుడు స్వయంగా చెప్పిన ఈ సూర్య అష్టోత్తర శతనామ స్తోత్రం ఎంతో మహిమాన్వితమైనది. ప్రతి రోజూ సూర్యోదయ కాలంలో భక్తి శ్రద్ధలతో ఈ స్తోత్రాన్ని చదివిన వాడికి యోగ్యురాలైన భార్య, ఉత్తమ సంతానం, ధనధాన్య వృద్ధి కలుగుతాయి. అతడికి గొప్ప ధారణశక్తి కూడా లభిస్తుంది. సంసార సాగరాన్ని అవలీలగా అతడు దాటగలడు. సూర్యుడి అనుగ్రహంతో అతడికి అనారోగ్య బాధలుండవు. ఏది కోరుకుంటే అది లభిస్తుంది.

## దక్షుడు చేసిన శివస్తుతి

దక్షయజ్ఞ విధ్వంసం జరిగాక దక్షుడు తన తప్పు తెలుసుకున్నాడు. తనకి పునర్జన్మ ప్రసాదించిన పరమేశ్వరుడే సర్వేశ్వరుడని గ్రహించాడు. అంతకాలం శివనింద చేసిన పాపాన్ని పోగొట్టు కోవటం కోసం ఎనిమిదివేల శివనామాలతో దివ్యంగా శంకర భగవానుణ్ణి ఇలా స్తుతించాడు.

**బ్రహ్మోవాచ**

ఏవం దృష్ట్వా తదా దక్షః శంభో ర్వీర్యం ద్విజోత్తమాః ।
ప్రాంజలిః ప్రణతో భూత్వా సంస్తోతు ముపచక్రమే ॥ 1

నమస్తే దేవదేవేశః నమస్తే ఽన్ధనసూదనః ।
దేవేంద్ర త్వం బలశ్రేష్ఠ దేవదానవపూజిత ॥ 2

సహస్రాక్ష విరూపాక్ష త్ర్యక్ష యక్షాధిపప్రియ ।
సర్వతః పాణిపాద స్త్వం సర్వతోక్షిశిరోముఖః ॥ 3

సర్వతః శ్రుతిమాం ల్లోకే సర్వ మావృత్య తిష్ఠసి ।
శంకుకర్ణో మహాకర్ణః కుంభకర్ణో ఽర్ణవాలయః ॥ 4

గజేంద్రకర్ణో గోకర్ణః శతకర్ణో నమోస్తు తే ।
శతోదరః శతావర్తః శతజిహ్వాః సనాతనః ॥ 5

గాయంతి త్వాం గాయత్రిణో అర్చయం త్యర్క మర్కిణః ।
దేవదానవ గోప్తా చ బ్రహ్మ చ త్వం శతక్రతుః ॥ 6

మూర్తిమాం స్త్వం మహామూర్తిః సముద్రః సరసాంనిధిః ।
త్వయి సర్వా దేవతాహి గావో గోష్ఠ ఇవా ఽఽసతే ॥ 7

త్వత్తః శరీరే పశ్యామి సోమ మగ్నిం జలేశ్వరమ్ ।
ఆదిత్యమథ విష్ణుం చ బ్రహ్మాణం సబృహస్పతిమ్ ॥ 8

క్రియాకరణకార్యే చ కర్తా కారణ మేవ చ ।
అసచ్చ సదస చ్చైవ తథైవ ప్రభవాప్యయౌ ॥ 9

నమో భవాయ శర్వాయ రుద్రాయ వరదాయ చ ।
పశూనాం పతయే చైవ నమో ఉస్త్వంధక ఘాతినే ॥ 10

త్రిజటాయ త్రిశీర్షాయ త్రిశూల వరధారిణే ।
త్ర్యంబకాయ త్రినేత్రాయ త్రిపుర ఘ్నాయ వై నమః ॥ 11

నమ శ్చండాయ ముండాయ విశ్వచండధరాయచ ।
దండినే శంకుకర్ణాయ దండి దండాయ వై నమః ॥ 12

నమో ఉర్ధదండి కేశాయ శుష్కాయ వికృతాయ చ ।
విలోహితాయ ధూమ్రాయ నీలగ్రీవాయ వై నమః ॥ 13

నమో ఉస్త్వ ప్రతి రూపాయ విరూపాయ శివాయచ ।
సూర్యాయ సూర్యపతయే సూర్యధ్వజ పతాకినే ॥ 14

నమః ప్రమథనాశాయ వృషస్కంధాయ వై నమః ।
నమో హిరణ్య గర్భాయ హిరణ్య కవచాయచ ॥ 15

హిరణ్యకృత చూడాయ హిరణ్యపతయే నమః ।
శత్రు ఘాతాయ చండాయ పర్ణ సంఘశయాయ చ ॥ 16

నమః స్తుతాయ స్తుతయే స్తయమానాయ వై నమః ।
సర్వాయ సర్వభక్షాయ సర్వభూతాంతరాత్మనే ॥ 17

నమో హోమాయ మంత్రాయ శుక్ల ద్వజపతాకినే ।
నమో ఉన మ్యాయ నమ్యాయ నమః కిలకిలాయ చ॥ 18

నమస్త్వాం శయమానాయ శయితా యోత్థితాయ చ ।
స్థితాయ దావమానాయ కుబ్జాయ కుటిలాయ చ ॥ 19

నమో నర్తన శీలాయ ముఖవాదిత్రకారిణే ।
బాధాసహాయ లుబ్ధాయ గీత వాదిత్ర కారిణే ॥ 20

నమో జ్యేష్ఠాయ శ్రేష్ఠాయ బలప్రమథ నాయచ ।
ఉగ్రాయ చ నమో నిత్యం నమశ్చ దశబాహవే ॥ 21

నమః కపాల హస్తాయ సిత భస్మ ప్రియాయ చ ।
విభీషణాయ భీమాయ భీష్మవ్రతధరాయ చ ॥ 22

నానావికృత వక్త్రాయ ఖడ్గజిహ్వోగ్ర దంష్ట్రిణే ।
పక్షమాసలవార్ధాయ తుంబీ వీణా ప్రియాయ చ ॥ 23

అఘోరఘోర రూపాయ ఘోర ఘోర తరాయ చ ।
నమ శ్శివాయ శాంతాయ నమ శ్శాంతమాయ చ ॥ 24

నమో బుద్ధాయ శుద్ధాయ సంవిభాగ ప్రియాయ చ ।
పవనాయ పతంగాయ నమ స్సాంఖ్యపరాయచ ॥ 25

నమః చండైక ఘంటాయ ఘంటాజల్సాయ ఘుంంటినే ।
సహస్ర శత ఘంటాయ ఘంటామాలా ప్రియాయ చ ॥ 26

ప్రాణ దండాయ నిత్యాయ నమస్తే లోహితాయ చ ।
హూం హూం కారాయ రుద్రాయ భగాకార ప్రియాయ చ ॥ 27

నమో ఉ పారవతే నిత్యం గిరివృక్ష ప్రియాయచ ।
నమో యజ్ఞాధిపతయే భూతాయ ప్రస్తుతాయ చ ॥ 28

యజ్ఞవాహాయ దాంతాయ తప్యాయ చ భగాయ చ ।
నమ స్తటాయ తట్యాయ తటినీ పతయే నమః ॥ 29

అన్నదాయా న్నవతయే నమ స్త్వన్నభుజాయ చ ।
నమ స్సహస్ర శీర్షాయ సహస్ర చరణాయ చ ॥ 30

సహస్రోద్ధత శూలాయ సహస్రనయనాచ ।
నమో బాలార్క వర్ణాయ బాలరూపధరాయ చ ॥ 31

నమో బాల్కార రూపాయ కాలక్రోడనకాయ చ ।
నమ శుద్ధాయ బుద్ధాయ క్షోభణాయ క్షయాయ చ ॥ 32

తరాంగాంకిత కేశాయ ముక్త కేశాయ వై నమః ।
నమ ష్షట్కర్మ నిష్ఠాయ త్రికర్మ నియతాయ చ ॥ 33

వర్ణాశ్రమాణాం విధి వత్పృథ గ్ధర్మ ప్రవర్తినే ।
నమ శ్రేష్ఠాయ జ్యేష్ఠాయ నమః కలకలాయ చ ॥ 34

శ్వేతపింగల నేత్రాయకృష్ణ రక్తేక్షణాయ చ ।
ధర్మ కామార్థ మోక్షాయ క్రథాయ క్రథనాయ చ ॥ 35

సాంఖ్యాయ సాంఖ్యముఖ్యాయ యోగాధిపతయే నమః ।
నమో రథ్యాది రథ్యాయ చతుష్పథపథాయ చ ॥ 36

కృష్ణాజినో త్తరీయాయ వ్యాల యజ్ఞోపవీతినే ।
ఈశాన రుద్రసంఘాత హరికేశ ః నమోస్తుతే ॥ 37

త్ర్యంబకా యాంబికానాథ వ్యక్తావ్యక్త నమోఽస్తుతే ।
కాలకామదకామఘ్న దృష్టో ద్వృత్తనిషూదన ॥ 38

సర్వగర్హిత సర్వఘ్న సద్యోజాత నమో స్తుతే ।
ఉన్మాదన శతావర్తః గంగాతోయార్ద్రమూర్ధజ ॥ 39

చంద్రార్ధ సంయుగావర్తః మేఘావర్తః నమోస్తుతే ।
నమో ఽన్న దానకర్త్రే చ అన్నదప్రభవే నమః ॥ 40

అన్న భోక్త్రేచ గోప్త్రేచ త్వ మేవ ప్రళయానలః ।
జరాయుజాండజా శ్చైవ స్వేదజోద్భిజ్జ ఏవ చ ॥ 41

త్వ మేవ దేవదేవేశ భూతగ్రామ శ్చతుర్విధః ।
చరాచరస్య స్రష్టా త్వం ప్రతిహర్తా త్వ మేవ చ ॥ 42

త్వ మేవ బ్రహ్మ విశ్వేశ అప్సు బ్రహ్మ వదంతి తే ।
సర్వస్య పరమా యోనిః సుధాంశో జ్యోతిషాం నిధిః ॥ 43

ఋక్సామాని తథోంకార మాహు స్త్వాం బ్రహ్మవాదినః ।
హాయి హాయి హరే హాయి హువా హావేతి వాఽసకృత్ ॥ 44

గాయంతి త్వాం సురశ్రేష్ఠాః సామగా బ్రహ్మవాదినః ।
యజుర్మయి ఋఙ్మయశ్చ సామాథర్వయుత స్తథా ॥ 45

పర్యసే బ్రహ్మవిద్భి స్త్వం కల్పోపవిషదాం గణైః ।
బ్రాహ్మణాః క్షత్రియా వైశ్యాః శూద్రా వర్ణా శ్రమా శ్చయే ॥ 46

త్వ మేవాఽఽశ్రమసంఘా శ్చ విద్యు త్స్తనిత మేవ చ ।
సంవత్సర స్త్వ మృతవో మాసా మాసార్థ మేవ చ ॥ 47

కలా కాష్ఠా నిమేషాశ్చ నక్షత్రాణి యుగాని చ ।
వృషాణాం కకుదం త్వం హి గిరీణాం శిఖరాణి చ ॥ 48

సింహో మృగాణాం పతయ స్తక్షకానంత భోగినామ్ ।
క్షీరోదో హ్యుదధీనాం చ మంత్రాణాం ప్రణవ స్తథా ॥ 49

వజ్రం ప్రహరణానాం చ వ్రతానాం సత్య మేవ చ ।
త్వ మేవే చ్ఛా ద్వేషశ్చ రాగో మోహః శమః క్షమా ॥ 50

వ్యవసాయో ధృతి ర్లోభః కామక్రోధ జయాజయౌ ।
త్వం గదీ త్వం శరీ చాపి ఖట్వాంగీ ముద్గరీ తథా ॥ 51

ఛేత్తా భేత్తా ప్రహర్తా చ నేతా మంతా సి నో మతః ।
దశలక్షణ సంయుక్తో ధర్మోఽర్థః కామ ఏవ చ ॥ 52

ఇందు స్సముద్ర స్సరితః పల్వాలాని సరాంసి చ ।
తతావల్య స్తృణౌషధ్యః పశవో మృగపక్షిణః ॥ 53

ద్రవ్య కర్మగుణారంభః కాలపుష్ప ఫలప్రదః ।
ఆది శ్చాంతశ్చ మధ్య శ్చ గాయ త్ర్యోంకార ఏవ చ ॥ 54

హరితో లోహితః కృష్ణో నీలః పీత స్తథా క్షణః ।
కద్రుశ్చ కపిలో బభ్రుః కపోతో మత్స్యక స్తథా ॥ 55

సువర్ణరేతా విఖ్యాతః సువర్ణ శ్చాస్యయో కుతః ।
సువర్ణనామా చ తథా సువర్ణప్రియ ఏవ చ ॥ 56

త్వ మింద్రశ్చ యమ శ్చైవ వరుణో ధనదో ఽనిలః ।
ఉత్ఫుల్ల శ్చిత్రభానుశ్చ స్వర్భానుర్భాను రేవ చ॥ 57

హోత్రం హోతా చ హోమ్యం చ హుతం చైవ తథా ప్రభుః ।
త్రి సౌపర్ణ స్తథా బ్రహ్మ న్యజుషాం శతరుద్రియమ్ ॥ 58

పవిత్రం చ పవిత్రాణాం మంగళానాం చ మంగళమ్ ।
ప్రాణాశ్చ త్వం రజశ్చ త్వం తమ స్సత్త్వ యుత స్తథా ॥ 59

ప్రాణోஉపానః సమాన శ్చ ఉదానో వ్యాన ఏవ చ ।
ఉన్మేష శ్చ నిమేషశ్చ క్షుత్తృట్ జృంభా తథై చ ॥ 60

లోహితాంగశ్చ దంష్ట్రీ చ మహావక్త్రో మహోదరః ।
శుచిరోమా హరిచ్ఛ్మ శ్రురూర్ధ్వ కేశ శ్చలాచలః ॥ 61

గీతావాదిత్ర నృత్యాంగో గీతవాదనక ప్రియః ।
మత్స్యో జాలో జలో உజయ్యో జలవ్యాలః కుటీచరః ॥ 62

వికాలశ్చ సుకాల శ్చ దుష్కాలః కాలనాశనః ।
మృత్యు శ్చైవాక్షయోஉస్తశ్చ క్షమా మాయాకరోత్కరః ॥ 63

సంవర్తో వర్తకశ్చైవ సంవర్తక బలాహకౌ ।
ఘంటాకీ ఘంటకీ ఘంటీ చూడాలో లవణోదధిః ॥ 64

బ్రహ్మ కాలాగ్ని వక్త్ర దండీ ముండ స్త్రిదండదధృక్ ।
చతుర్యుగ శ్చతుర్వేద శ్చతుర్హోత్రశ్చతుష్పథః ॥ 65

చాతురాశ్రమ్య నేతా చ చాతుర్వర్ణ్యకర శ్చ హ ।
క్షరాక్షరః ప్రియో ధూర్తో గణైర్గణ్యో గణాధిపః ॥ 66

రక్తమాల్యాంబరధరో గిరీశో గిరిజాప్రియః ।
శిల్పీశః శిల్పినః శ్రేష్ఠః  సర్వ శిల్ప ప్రవర్తకః ॥ 67

భగనేత్రాంతక శ్చండః పూష్ణోదంతవినాశనః ।
స్వాహా స్వధా వషట్కారో నమస్కారో నమోస్తుతే ॥ 68

గూఢవ్రతశ్చ గూఢవ్రతనిషేవితః ।
తరణ స్తారణశ్చైవ సర్వభూతేషు తారణః ॥ 69

ధాతా విధాతా సంధాతా నిధాతా ధారణో ధరః ।
తపో బ్రహ్మ చ సత్యం చ బ్రహ్మచర్యం తథా ఽఽర్జవమ్ ॥ 70

భూతాత్మా భూతకృ ద్భూతో భూతభవ్య ద్భవోద్భవః ।
భూర్భువః స్వరితశ్చైవ భూతో హ్యగ్ని ర్మహేశ్వరః ॥ 71

బ్రహ్మవర్తః సురావర్తః కామావర్తనమో ఽస్తుతే ।
కామబింబ వినిర్హ్వంతా కర్ణికార ప్రజప్రియః ॥ 72

గోనేతా గోప్రచారశ్చ గోవృషేశ్వరవాహనః ।
త్రైలోక్య గోప్తా గోవిందో గోప్తా గోవర్గ ఏవ చ ॥ 73

అఖండ చంద్రాభిముఖః సుముఖో దుర్ముఖో ఽముఖోః ।
చతుర్ముఖో బహుముఖో రణేష్వభిముఖ స్సధా ॥ 74

హిరణ్యగర్భ శ్శకుని ర్ధనదో ఽర్ధపతి ర్విరాట్ ।
అధర్మహా మహాదక్షో దండధారో రణప్రియః ॥ 75

తిష్ఠ న్స్థిరశ్చ స్థాణుశ్చ నిష్కంపశ్చ సునిశ్చలః ।
దుర్వారణో దుర్విషహో దుస్సహో దురితక్రమః ॥ 76

దుర్ధరో దుర్వశో నిత్యో దుర్ధర్షో విజయో జయః ।
శశః శశాంక నయన శ్శీతోష్ణః క్షుత్తృషా జరా ॥ 77

ఆధయో వ్యాధయశ్చైవ వ్యాధిహా వ్యాధిపశ్చ యః ।
సహ్యో యజ్ఞ మృగవ్యాధో వ్యాధినామాకరోఽకరః ॥ 78

శిఖండీ పుండరీకశ్చ పుండరీకావలోకనః ।
దండధృక్చక్రదండశ్చ రౌద్ర భాగ వినాశనః ॥ 79

విషపోఽమృతప శ్చైవ సురాపః క్షీరసోమపః ।
మధుపశ్చా ఽనిఽఽపప శ్చైవ సర్వపశ్చ బలాలః ॥ 80

వృషాంగరాంభో వృషభ స్తథా వృషభలోచనః ।
వృషభశ్చైవ విఖ్యాతో లోకానాం లోక సంస్కృతః ॥ 81

చంద్రాదిత్యౌ చక్షుషీ తే హృదయం చ పితామహః ।
అగ్నిష్టోమ స్తథా దేహోధర్మకర్మ ప్రసాదితః ॥ 82

న బ్రహ్మా న చ గోవిందః పురాణఋుషయో న చ ।
మాహాత్మ్యం వేదితుం శక్తా యాథాతథ్యేన తే శివః ॥ 83

శివాయా మూర్తయ స్సూక్ష్మా స్తామహ్యం యాంతు దర్శనమ్ ।
తాభిర్మాం సర్వతో రక్ష పితా పుత్రమివౌ రసమ్ ॥ 84

రక్ష మాం రక్షణీయో ఽహం తవా నఘ నమో స్తుతే ।
భక్తాను కంపీ భగవాన్భక్తశ్చాహం సదా త్వయి ॥ 85

యః సహస్రాణ్యనేకాని పుంసా మావృత్యదుర్దృశామ్ ।
తిష్ఠ త్యేకః సముద్రాంతే న మే గోప్తా ఽ స్తు నిత్యశః ॥ 86

యం వినిద్రా జితస్వాసాః సత్త్వస్థాః సమదర్శినః ।
జ్యోతిః పశ్యంతి యుంజానా స్తస్మై యోగాత్మనే నమః ॥ 87

సంభక్ష్య సర్వభూతాని యుగాంతే సముపస్థితే ।
యశ్శేతే జలమధ్యస్థస్తం ప్రపద్యేం ఋశాయినమ్ ॥ 88

ప్రవిశ్య వదనం రాహోర్యః సోమం పిబతే నిశి ।
గ్రసత్యర్కం చ స్వర్భానుర్భూత్వా సోమాగ్ని రేవ చ ॥ 89

అంగుష్ఠ మాత్రాః పురుషా దేహస్థాః సర్వదేహినామ్ ।
రక్షంతు తే చ మాం నిత్యం నిత్యం చాఽఽప్యాయయంతు మాం॥ 90

యేనాప్యుత్పాదితా గర్భా ఆపో భాగగతా శ్చయే ।
తేషాం స్వాహా స్వధా చైవ అప్నువంతి స్వదంతి చ ॥ 91

యేన రోహంతి దేహాస్తాః ప్రాణినో రోదయంతి చ ।
హర్షయంతి న కృష్యంతి నమస్తేభస్తు నిత్యశః ॥ 92

యే సముద్రే నదీదుర్గే పర్వతేషు గుహాసు చ ।
వృక్షమూలేషు గోష్ఠేషు కాంతార గహనేషు చ ॥ 93

చతుష్పథేషు రథ్యాసు చత్వరేషు సబాను చ ।
హస్త్యశ్వర థశాలాసు జీర్ణోద్యానాలయేషు చ ॥ 94

యేషు పంచసు భూతేషు దిశాసు విదిశాసు చ ।
ఇంద్రార్కయో ర్మధ్యగతా యే చ చంద్రార్క రశ్మిషు ॥ 95

రసాతలగతా యే చ యే చ తస్మాత్పరం గతాః ।
నమస్తేభ్యో నమస్తేభ్యో నమస్తేభ్యోఽపి సర్వశః 96

సర్వ స్త్వం సర్వగో దేవః సర్వభూతపతి ర్భవః ।
సర్వభూతాంతరాత్మా చ తేన త్వం న నిమంత్రితః ॥ 97

త్వ మేవ చేజ్యసే దేవ యజ్ఞైర్వివిధ దక్షిణైః ।
త్వ మేవ కర్తా సర్వస్య తేన త్వం న నిమంత్రితః ॥ 98

అథవా మాయయా దేవ మోహితః సూక్ష్మయా త్వయా ।
తస్మాత్తు కారణాద్వాఽపి త్వం మయా న నిమంత్రితః ॥ 99

ప్రసీద మమ దేవేశ త్వమేవ శరణం మమ ।
త్వం గతస్త్వం ప్రతిష్ఠా చ వ చాఽన్యోఽ ఆస్తితి మే మతిః ॥ 100

*(శ్లో॥1-100, అధ్యా-24)*

దక్షుడు చేసిన ఈ దివ్య స్తవాన్ని నిత్యం పారాయణ చేసినవాడు ఎప్పుడు అశుభాల్ని పొందదు. దీర్ఘాయువు అతడికి లభిస్తుంది. సకల దేవతల్లో పరమేశ్వరుడు గొప్పవాడైనట్టు దక్షుడు చేసిన ఈ శివస్తుతి కూడా అంతగొప్పది. కీర్తి ప్రతిష్టలు, విద్య, గౌరవం, సంపదలు కావాలని కోరుకునేవారు ఈ దివ్య స్తవాన్ని పఠిస్తే మంచిది. దుఃఖాలకి, బాధలకి గురైనవారు ఈ స్తోత్రాన్ని పఠించి వాటినుంచి విముక్తి పొందవచ్చు. నిత్యం ఈ స్తవాన్ని పారాయణ చేసేవాడికి ఎవరూ విఘ్నాలు కల్పించలేరు. ఏది సంకల్పిస్తే అది జరుగుతుంది.

దక్షుడు చేసిన ఈ దివ్య స్తోత్రం మంత్రాత్మకమైనది. పాపజన్ములైనవారు కూడా దీన్ని పఠించవచ్చు. స్త్రీలు, శూద్రులు, వైశ్యులు ఇలా ఎవరైనా ఈ దివ్య స్తవాన్ని పారాయణ చేస్తే రుద్రలోకానికి చేరుకుంటారు. శివుడికి ప్రీతికరమైన పర్వదినాల్లో పఠిస్తే మరింత త్వరగా ఆయన అనుగ్రహం లభిస్తుంది.

ఈ స్తోత్రం ద్వారా పూర్తి ఫలితాల్ని పొందాలంటే ముందుగా గణపతిని, కుమారస్వామిని, పార్వతీదేవిని, నందీశ్వరుణ్ణి పూజించి లేక స్మరించి ఆ తరువాత ఈ స్తోత్రాన్ని పఠించాలి. శివస్తుతులలో ఇది ఉత్తమోత్తమమైన స్తోత్రం.

## ఉత్కల (విరజా) క్షేత్రం

భారతదేశంలో వున్న దివ్యక్షేత్రాల్లో గొప్పది ఉత్కల క్షేత్రం. దీనినే విరజాక్షేత్రం అని కూడా అంటారు. ఈ క్షేత్రంలో విరజా అనే పేరుతో సరస్వతీదేవి కొలువైవుంది. ఆ తల్లిని దర్శించినవాడు తన ఏడు తరాల వారినీ పవిత్రుల్ని చేస్తాడు. విరజాక్షేత్రంలో ఇంకా చాలా దేవీ ఆలయాలున్నాయి. వారంతా సకలపాపాల్ని హరించి భక్తుల కామితార్థాలని తీరుస్తుంటారు. ఆ విరజాక్షేత్రంలోనే సకలపాప హారిణి అయిన వైతరణీ అనే నది వుంది. అందులో స్నానం చేసినవాడికి పాపాలన్నీ నశిస్తాయి. ఆ నది సమీపంలోనే శ్రీమన్నారాయణుడు యజ్ఞ వరాహమూర్తిగా అవతరించాడు. ఆ స్వామిని దర్శించినవాడు విష్ణుపదాన్ని చేరుకుంటాడు.

విరజాక్షేత్రంలో 1.కపిలతీర్థం 2,గోగ్రహతీర్థం 3.సోమతీర్థం 4.ఆలాబుతీర్థం 5.మృత్యుంజయ తీర్థం 6.వరాహతీర్థం 7.వాసుక తీర్థం 8.సిద్ధకేశ్వర తీర్థం అనే ఎనిమిది దివ్య తీర్థాలున్నాయి. ఈ దివ్య తీర్థాలలో ఇంద్రియనిగ్రహుడై యధావిధిగా స్నానాన్ని ఆచరించినవాడు సకలలోక పూజ్యుడవుతాడు.

విరజాక్షేత్రంలో పితృదేవతలకి పిండప్రదానం చేస్తే అది అక్షయ ఫలితాన్నిస్తుంది. ఈ క్షేత్రంలో ప్రాణం విడిచిపెట్టినవారికి మోక్షం కలుగుతుంది. ఇక్కడ వున్న సముద్రంలో స్నానంచేసి కపిలుడు అనే పేరుతో వెలసిన శ్రీమహావిష్ణువుని, వారాహి అనే అమ్మవారిని దర్శించిన వాడికి స్వర్గం ప్రాప్తిస్తుంది. ఇంకా ఈ క్షేత్రంలో ఎన్నో దివ్యతీర్థాలు, ఆలయాలున్నాయి.

విరజాక్షేత్రంలో వున్న సముద్రతీరానికి ఉత్తర భాగంలో ఒక రహస్యమైన ముక్తి క్షేత్రం వుంది. అది పది యోజనాల విస్తీర్ణంలో ఉంటుంది. అక్కడంతా

ఇసుక మేటలు వుంటాయి. ఈ ప్రాంతంలో పూర్వం అశోకాది వృక్షాలు, మందారాది పూలచెట్లు, ఎన్నో వున్నాయి. దిగుడు బావులు తామరలతో నిండిన అందమైన సరోవరాలు, అన్ని ఆశ్రమధర్మాలు పాటించే స్త్రీలు పురుషులు అక్కడ వున్నారు.

ఆ క్షేత్రంలో పురుషోత్తముడనే పేరుతో మహావిష్ణువు కొలువై వున్నాడు. ఆయన అనుగ్రహంతో ఆ ప్రాంతమంతా ఎంతో పవిత్రంగా మారిపోయింది. బ్రహ్మ, రుద్రుడు, ఇంద్రుడు, అగ్ని వంటి దేవతలు సదా అక్కడ నివసిస్తూ వుంటారు. గంధర్వులు, అప్సరసలు, పితృదేవతలు, మానవులు, మునులు, వాలఖిల్యాది మహర్షులు, కశ్యపాది ఋషులు, గరుడులు, కిన్నరులు, నాగులు, వేదాలు, వేదాంగాలు, సర్వశాస్త్రాలు, ఇతిహాసపురాణాలు, యజ్ఞాలు, పుణ్యనదులు, తీర్థాలు, పర్వతాలు, సాగరాలు అక్కడే వున్నాయి. ఈ విధంగా సకల ఋష మునిగణ సమూహాలతో కూడుకున్న ఆ పవిత్ర ప్రదేశం అందరినీ ఆకర్షిస్తుంది. సాక్షాత్తు పురుషోత్తముడే కొలువున్న ఆ ఉత్కల దేశం ఆ దేశవాసులు ఎంతో ధన్యులు.

ఉత్కలదేశంలో వెలిసిన శ్రీపురుషోత్తమ భగవానుణ్ణి సేవించినవాడు మరణానంతరం స్వర్గానికి వెళతాడు. నరకాన్ని అతడు ఎప్పటికీ చూడడు. ప్రసన్నంగా వుండే విశాలమైన నేత్రాలు, అందమైన కనుబొమలు, నల్లని కేశపాశాలు, బంగారుకిరీటం, ఇంపైన చెవికమ్మలు, మధురమైన చిరునవ్వు, చక్కని పలువరుసతో శోభించే పురుషోత్తముడి దివ్య సుందర రూపం త్రిలోకానందకరం.

## అవంతీ వైభవం

మాళవదేశంలో అవంతీ నగరం వుంది. అది ఎంతో సుందరమైన నగరం. భూమండలం అనే ఋషభానికి (ఎద్దు) మూపురంలా ఆ అవంతి శోభిస్తోంది. ఆ దివ్యక్షేత్రంలో మహేశ్వరుడు మహాకాలుడనే పేరుతో వెలిసాడు. ఆయన్ని దర్శిస్తే అభీష్టాలన్నీ నెరవేరతాయి. అక్కడ ఒక దివ్యమైన కుండవుంది.

అందులో స్నానం చేస్తే సకలపాపాలు హరిస్తాయి. శివానుగ్రహం కావాలనుకునే వాడు ఆ కుండంలో స్నానం చేసి అక్కడే దేవ, ఋషి పితృతర్పణాలు వదిలి మహాకాలుడి ఆలయానికి వెళ్ళాలి. ముందుగా ఆలయం చుట్టూ మూడు ప్రదక్షిణలు చేసి, తరువాత స్వామిని గంధాది ఉపచారాలతో పూజించాలి. ఆ విధంగా చేసినవాడికి అశ్వమేధయాగఫలం లభిస్తుంది.

అవంతీక్షేత్రంలో 'శిప్రా' అనేనది వుంది. ఆ నదిలో స్నానం చేసి పితృదేవతలకు, దేవతలకు, ఋషులకు తర్పణాలు చేసినవాడు స్వర్గలోకానికి వెళతాడు. ఆ శిప్రానదీ తీరంలో శ్రీమహావిష్ణువు 'గోవిందస్వామి' అనే పేరుతో కొలువైవున్నాడు. ఆయన్ను సేవించినవాడి ఇరవై వంశాలవారూ తరిస్తారు. అక్కడే విక్రముడు అనే పేరుతో కూడా మరొక ఆలయం వుంది. ఆ స్వామిని దర్శించిన వారు కూడా ముందు చెప్పిన పుణ్య ఫలితాలనే పొందుతారు. ఆ ప్రాంతంలోనే ఇంద్రాది దేవతలు సప్తమాతృకలు ఉన్నారు. వారు కోరిన కోరికలు తీరుస్తారు.

అవంతీనగరాన్ని రాజసింహుడనే మహారాజు పాలించేవాడు. ఆ నగరంలో 18 ఉపనగరాలున్నాయి. అవన్ని ఎంతో అందమైన రాజమార్గాలతో, ఐశ్వర్యంతో తులతూగుతుంటాయి. ఆ నగరంలో అందరూ విద్యావంతులే. నిరంతరం వేదఘోష అక్కడ మారుమ్రోగుతూ వుంటుంది. ఆ నగరంలో ఇతిహాసపురాణ ప్రవచనాలు నిత్యం జరుగుతుంటాయి. ఒకానొకకాలంలో అవంతీదేశాన్ని ఇంద్రద్యుమ్నుడు పాలించాడు.

## (పూరి) పురుషోత్తమ క్షేత్ర మాహాత్మ్యం

పూర్వం ఇంద్రద్యుమ్నుడనే మహారాజు అవంతీ (ఉజ్జయనీ) రాజ్యాన్ని ధర్మబద్ధంగా, ప్రజారంజకంగా పరిపాలించాడు. ఆయన కాలంలో అవంతీరాజ్యం సకల సంపదలతో తులతూగింది. ప్రజలంతా నిత్యం సుఖసంతోషాలతో జీవించారు. కరువుకాటకాలన్న వారికి అసలే తెలీదు. ఇంద్రద్యుమ్నుడు వేదవేదాంగ వేత్తల్ని, పండితుల్ని పోషించి యజ్ఞయాగాది క్రతువుల్ని అనేకం

జరిపించాడు. ఒకనాడు ఆయనకి శ్రీహరిని సేవించాలని ఆయనకు ఒక దివ్యమైన ఆలయాన్ని నిర్మించాలనే కోరిక కలిగింది.

ఇంద్రద్యుమ్నుడు శ్రీహరి ఆలయనిర్మాణం కోసం తగిన స్థలం ఎక్కడుందో తెలుసుకోవటానికి, మంత్రులు, పురోహితులు, పరివారం, చతురంగ బలాలతో సహా అంతఃపుర స్త్రీలని, వంది మాగధుల్ని వెంటబెట్టుకుని అవంతి నుంచి బయలుదేరాడు. ఆయనతో పాటు నగరంలో వున్న చాతుర్వర్ణాల ప్రజలు, వ్యాపారులు, కవులు, గాయకులు కూడా వెంట వచ్చారు. ఆ విధంగా ఇంద్రద్యుమ్నుడు దక్షిణ సముద్రతీరానికి వచ్చాడు. ఆ సముద్రతీరం ఎంతో ఆహ్లాదకరంగా వుంది. అందమైన పుష్పఫల వృక్షాలతో నయనమనోహరంగా కనిపిస్తుంది. ఎన్నో రకాల పక్షులు అక్కడ కిలకిల రావాలు చేస్తూ మనసుకి ఆనందాన్ని కలుగచేస్తున్నాయి. అది మొత్తం పదియోజనాల విస్తీర్ణంలో ప్రకాశిస్తోంది. ఇంద్రద్యుమ్నుడు అక్కడ విడిదిచేసాడు.

## పురుషోత్తమ క్షేత్రం పూర్వకథ

పూర్వం లక్ష్మీదేవి నారాయణుడికి నమస్కరించి "స్వామీ! లోకహితం కోరి నేను మిమ్మల్ని అడుగుతున్నాను. భూలోకంలో మానవ జన్మ ఎంతో దుర్లభమైంది కదా! అక్కడ జన్మించిన వారిని లోభం, మోహం, కామం, క్రోధం అనే దుర్గుణాలు పట్టి పీడిస్తుంటాయి. మానవులంతా వాటి బారినపడి జనన, మరణ, వలయంలో చిక్కుకుపోయి ఎంతో తపిస్తున్నారు. వారందరికీ ఏదైనా తరించే తరుణోపాయం వున్నదా! దయచేసి తెలియచేయండి" అని ప్రార్థించింది.

లక్ష్మీదేవి మాటలు విని శ్రీహరి చిరునవ్వుతో ఆమెకిలా సమాధానం చెప్పాడు. "దేవీ! అందరూ సులభంగా, సుఖంగా చేరతగింది, ఉపాసించతగింది, మహాఫలాల్ని ప్రసాదించేది అయిన దివ్యక్షేత్రం భూలోకంలో ఒకటుంది అదే పురషోత్తమ (పూరిజగన్నాథం) క్షేత్రం. ఆ దివ్యక్షేత్రం ఎంత గొప్పదంటే దాని గురించి తలుచుకున్నా, విన్నా, స్మరించినా ఎంతో పుణ్యం లభిస్తుంది. ఆ తీర్థమహిమని మరీచ్యాది మహర్షులు కూడా ఎరగరు. అలాంటి దివ్యతీర్థాన్ని క్షేత్రాన్ని గురించి చెబుతున్నా విను.

పూర్వం కల్పాంతంలో మహాప్రళయం సంభవించింది. ఆ ప్రళయంలో స్థావర జంగమాత్మకమైన ప్రపంచం అంతా లయమైపోయింది. అంతా చీకటిమయంగావుంది. అప్పుడు ఆ కటిక చీకటికి వెనక ఒకేఒక్కడు మేల్కొని వున్నాడు. ఆయనే పరమాత్మ. ఆయనే పరబ్రహ్మ, త్రిమూర్తి స్వరూపుడు, యోగీశ్వరుడు సకల భూతాల సృష్టికర్త అయిన వాసుదేవుడు. యోగనిద్ర నుంచి మేల్కొన్న ఆ వాసుదేవ పరబ్రహ్మ తననాభి కమలం నుంచి కమలదళాల కాంతితో ప్రకాశించే బ్రహ్మ దేవుణ్ణి, పంచ తన్మాత్రలకి కారణాలైన గాలి, నీరు, నిప్పు, భూమి, ఆకాశం అనే పంచభూతాలని స్థూల సూక్ష్మరూపాలలో సృష్టించాడు. అలాగే బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులనే నాలుగు వర్ణాల వారిని, పంచముల్ని, మ్లేచ్ఛ జాతి వారిని వేరు వేరుగా సృష్టించాడు.

తరువాత బ్రహ్మదేవుణ్ణి ప్రేరేపించి ఆయన ద్వారా మరీచ్యాదిమహర్షుల్ని సకల దేవతల్ని, పితృదేవతల్ని, యజ్ఞాలనూ, విద్యాధరులు, యక్షులు తదితర గణాలవారినీ, నర, వానర, సింహ శార్దూలాది మృగాలనూ జరాయుజాలు, అండజాలు, స్వేదజాలు, ఉద్భిజాలనే నాలుగు రకాల చరాచర భూతకోటినీ సృష్టించాడు. తరువాత ప్రజాపతి తన కుడి భాగాన్ని పురుషుడిగా ఎడమ భాగాన్ని స్త్రీగా మలచి, స్త్రీ పురుష అనే రెండు రూపాల్ని ధరించాడు.

ఆ విధంగా బ్రహ్మదేవుడు మానసిక సృష్టి చేసిన తరువాత స్త్రీ – పురుష మిథునం ద్వారా తిరిగి నూతన సృష్టిని ప్రారంభించాడు. ఎన్నో జీవరాసులు, మానవులు పరంపరగా సృష్టించబడ్డారు. దేవీ అలా బ్రహ్మ సృష్టిలో ఉత్తమ, మధ్యమ అధమ భేదాలతో తయారైన ఉపాధులన్నీ నా క్షేత్రాలే. ఆ విధంగా సృష్టిరచన చేసిన చతుర్ముఖ బ్రహ్మ కొంచెం ఆలోచించి ధ్యానంలోకి వెళ్ళి వాసుదేవతత్త్వంలో లీనమైపోయాడు. కొద్దిసేపటి తరువాత తానే వాసుదేవాత్మక రూపాన్ని ధరించాడు. కేవలం ధ్యానం చేసినంత మాత్రాన్నే జనార్ధనుడు ఆక్షణంలోనే సహస్రాక్షుడు, సహస్రపాదుడు, సహస్రశీర్షుడు అయిన మహాపురుషుడుగా ఆవిర్భవించాడు.

తెల్లటి తామరపూలలాంటి కళ్ళతో, నీలిరంగు శరీరంతో, శ్రీవత్స చిహ్నాన్ని ధరించిన ఒక దివ్యమంగళ స్వరూపం సాక్షాత్కరించింది. పితామహుడైన బ్రహ్మదేవుడు ఒక్కక్షణం తనముందు నిలిచిన దివ్యమూర్తిని చూసి ఎంతో ఆశ్చర్యపోయాడు. వెంటనే ఆయనకి అర్ఘ్యపాద్యాలు సమర్పించి, అక్షతలతో పూజించి నమస్కరించాడు. తరువాత మంగళకరమైన మాటలతో ఆయన్ని ఘనంగా స్తుతించాడు. బ్రహ్మ చేసిన స్తోత్రాలు విన్న జనార్ధనుడు (అనగానేను) పితామహా నన్ను ఎందుకు ధ్యానించావు? అని అడిగాడు.

స్వామీ! స్వర్గాన్ని చేరాలంటే, యజ్ఞం, దానం, వ్రతాలు, యోగాలు, సత్యధర్మాచరణలు అనేవి మార్గాలుగా బుధులు చెబుతారు. అయితే వీటన్నిటినీ ఆచరించటం అందరికీ సులభసాధ్యం కాదు కదా! అందుకే అందరికీ ఆచరణ యోగ్యంగా వుండే సులభమార్గాన్ని లోకహితం కోసం చెప్పమని వేడుకుంటున్నాను" అని ప్రార్థించాడు. బ్రహ్మ ప్రార్థన విని వాసుదేవుడు ఆయనతో –

పితామహా! సంసారదుఃఖాన్ని పొగొట్టేది, నాలుగు వర్ణాలవారికీ, సుఖాన్ని ప్రసాదించేది, భక్తి ముక్తులకు కారకమైనది, వెంటనే ఫలితాన్నిచ్చేది, నాలుగుయుగాలలో అందరిచేతా సేవించతగినది, సకల దేవతలకూ దానవులకూ మానవులకూ సుసేవ్యమై వున్నదీ అయిన దివ్యక్షేత్రం భూలోకంలో ఒకటుంది. దానిపేరే పురుషోత్తమ క్షేత్రం. అది దక్షిణ సముద్రతీరంలో పదియోజనాల విస్తీర్ణంలో వుంది. అక్కడ ఒక పురాతనమైన మర్రిచెట్టు వుంది. అది ఎంత గొప్పదంటే! కల్పాంతంలో కూడా నశించదు. ఆ వట(మర్రి) వృక్షంలో నేను స్వయంగా కొలువున్నాను.

మహామహిమాన్వితమైన ఆవటవృక్షాన్ని దర్శించి దాని కింద విశ్రమించిన వాడికి బ్రహ్మహత్యాపాపం నుంచి కూడా విముక్తి లభిస్తుంది. ఆ దివ్య వృక్షానికి భక్తిగా ప్రదక్షిణాలు చేసేవాడు సాక్షాత్తు విష్ణులోకానికి చేరుకుంటాడు. ఆ మర్రి చెట్టుకి కొద్ది దూరంలోనే మహావిష్ణువు ఆలయం వుంది. ఆలయంలో పరమాత్మ తనకుతానే నిర్మించుకున్న దివ్య విగ్రహం నెలకొంది. దాన్ని దర్శిస్తే చాలు సకలపాపాలూ హరించి స్వర్గానికి వెళతారు.

ఆ విషయం తెలుసుకున్న ఎంతోమంది నిత్యం అక్కడి పరమాత్మని దర్శిస్తూ మరణానంతరం సరాసరి స్వర్గానికి వెళుతున్నారు. ఇలా అందరూ స్వర్గానికి వెళ్ళిపోతుంటే నరకానికి వచ్చేవారు కరువయ్యారు. అది గమనించిన యమధర్మరాజు హుటా హుటిని వాసుదేవుడి దగ్గరకి వచ్చి ఇలా విన్నవించాడు.

స్వామీ!జగన్నాథా! నీ దివ్యచరణారవిందాలకు నమస్కరిస్తున్నాను. శ్రీవత్సాన్ని వక్షస్థలం మీద ధరించినవాడా! పీతాంబరధారీ! శంఖ, చక్రగదాధరా! హారకేయూరభూషితా! జగద్గురువైన నీకు నమస్కారం. ప్రకృతికి అవతల సర్వేంద్రియాలనీ విడిచిపెట్టి కేవలం జ్ఞానజ్యోతిగా, సర్వసాక్షిగా, కేవలాత్మ స్వరూపుడిగా వున్న నీకు నమస్కరిస్తున్నాను" అని స్తుతించాడు. యముడి స్తుతి విన్న వాసుదేవుడు యమధర్మరాజా! ఎందుకు నన్ను స్తుతిస్తున్నావు? నీవు ఇక్కడికి వచ్చిన కారణమేమిటి? అని ప్రశ్నించాడు.

"స్వామీ! పురుషోత్తమ క్షేత్రంలో తమరి దివ్యమంగళవిగ్రహం ఇంద్ర నీలమణిలా ప్రకాశిస్తూ జనులందరి పాపాలని పటాపంచలు చేస్తోంది. ఆ విగ్రహాన్ని దర్శించి, భక్తి శ్రద్ధలతో సేవించినవారు అన్ని పాపాలనుంచీ విముక్తులై సరాసరి స్వర్గానికే వెళ్ళిపోతున్నారు. ఇక పాపులనేవారు ఒక్కరు కూడా నా నరకలోకానికి రావటం లేదు. పాపుల్ని దండించే అధికారం వున్న నేను ఎవరూ రాకపోవటంతో నాకు పనిలేకపోతోంది. నా పదవికి కూడా అగౌరవం జరుగుతుంది. దయచేసి నా కర్తవ్యాన్ని నిర్వహించుకునేందుకు భూలోకంలో పురుషోత్తమ క్షేత్రంలో వున్న నీ దివ్య విగ్రహాన్ని ఉపసంహరించు" అని వేడుకున్నాడు యమధర్మరాజు.

యముడి విన్నపాన్ని విన్న వాసుదేవుడు సరేనని అతడికి అభయమిచ్చి తన ప్రతిమని ఆ ఆలయం నించి మాయంచేసి సముద్రతీరంలో వున్న ఇసుక అడుగున దాచిపెట్టాడు.ఆ విధంగా ఆనాడు వాసుదేవుడి ఇంద్రనీలమణి విగ్రహం మరుగునపడిపోయింది.

## పురుషోత్తమ క్షేత్రాన్ని దర్శించిన ఇంద్రద్యుమ్నుడు

సముద్రతీరంలో విడిదిచేసిన ఇంద్రద్యుమ్నుడు పురుషోత్తమ క్షేత్రంలోకి ప్రవేశించాడు. ఆ క్షేత్రంలో వున్న సుందరమైన ప్రదేశాలన్నీ దర్శించాడు. అక్కడ వింధ్య పర్వత పాదం నుంచి పుట్టిన పుణ్యనదులు ఎన్నో వున్నాయి. వాటిలో సకల పాపహరుణ్ణి గంగతో సమానమైనది, దక్షిణ సముద్రంలో కలిసేది అయిన 'స్విత్రోపల' అనే పుణ్యనది వుంది. ఆ నదికి ఇరువైపులా ప్రజలంతా సుఖసంతోషాలతో ఆనందంగా జీవిస్తున్నారు. నాలుగు వర్ణాలవారూ స్వధర్మాన్ని పాటిస్తూ తమ జీవనాన్ని కొనసాగిస్తున్నారు. విప్రులు వేద వేదాంగాలని నిత్యం అధ్యయనం చేస్తూ, యజ్ఞయాగాది క్రతువుల్ని ఘనంగా నిర్వహిస్తున్నారు.

అలాంటి దివ్య క్షేత్రాన్ని దర్శించిన ఇంద్రద్యుమ్నుడు "నిజంగా ఇది మానసక్షేత్రం, మహామహిమాన్విత క్షేత్రం. సాక్షాత్తు జగన్నాథుడు కొలువైవున్న ఈ క్షేత్రంలోనే నేనుంటాను" అని అనుకున్నాడు. అంతేకాదు "పూర్వం ఇంద్రనీలమణి విగ్రహరూపంలో ఇక్కడి మర్రి చెట్టుదగ్గర కొలువైవున్నాడట కదా! ప్రస్తుతం ఆ విగ్రహం అదృశ్యమయ్యింది. తిరిగి నేను వాసుదేవుణ్ణి నాకఠోర దీక్షతో, తపస్సుతో మెప్పించి తిరిగి వైభవంగా విష్ణుదేవుడి ఆలయాన్ని నిర్మిస్తా" అని స్థిరనిర్ణయాన్ని కూడా తీసుకున్నాడు.

**ఆలయనిర్మాణం :** ఇంద్రద్యుమ్నుడు విష్ణు ఆలయాన్ని నిర్మించటానికి వెంటనే జ్యోతిష్కుల్ని పిలిపించాడు. ఆలయ నిర్మాణానికి తగిన ముహూర్తం నిర్ణయించమని చెప్పాడు. తరువాత పరివారాన్ని పిలిచి నిర్మాణానికి తగిన భూమిని ఎన్నికచేయమని చెప్పి పంపించాడు. వారు చేసిన నిర్ణయం ప్రకారం ఒక శుభముహూర్తంలో మంగళవాద్యాలు మారుమ్రోగుతుండగా వేదపండితుల ఆధ్వర్యంలో ఆలయ నిర్మాణానికి శంకుస్థాపన చేసాడు. ఆ సందర్భంగా స్వామికి సకలోపచారాలతో పూజచేసి పూర్ణకుంభాన్ని, అర్ఘ్యాన్ని సమర్పించాడు. ఎంతో వైభవంగా సాగిన ఆ కార్యక్రమానికి ఉత్కళ, కోసల దేశాధిపతుల్ని కూడా ఆహ్వానించాడు.

**అశ్వమేధయాగం :** శ్రీమహావిష్ణువు ఆలయ శంకుస్థాపన కార్యక్రమానికి ఇంకా ఎందరో రాజ్యాధీశులు వచ్చారు. వచ్చిన వారందరితో మహావిష్ణు ప్రతిమని రూపొందించటానికి తగిన శిలని వెతికి తీసుకురండి అని కోరాడు ఇంద్రద్యుమ్నుడు. అందరికీ ఈ వర్తమానాన్ని తెలియచేయమన్నాడు. ఇంద్రద్యుమ్నుడి ఆదేశం విన్న రాజులందరూ తాము శిలకోసం వెతకటానికి వెళ్తూ మిగిలిన రాజులందరికీ ఈ వర్తమానాన్ని తెలియచేసారు. అలా సకలరాజలోకానికీ ఈ వార్త తెలిసి పోయింది. అందరూ పురుషోత్తమక్షేత్రానికి వచ్చి ఇంద్రద్యుమ్నుడికి ధనకనక వస్తు వాహనాల్ని భక్తిగా సమర్పించారు. వచ్చిన రాజులందరినీ చూసాక ఇంద్రద్యుమ్నుడికి అశ్వమేధయాగం చేయాలి అన్న సంకల్పం కలిగింది. వెంటనే అందుకు తగిన సన్నాహాలు చేసాడు.

ఇంద్రద్యుమ్నుడి ఆజ్ఞతో అశ్వమేధయాగం అత్యంతవైభవంగా ప్రారంభమయ్యింది. ఆ దివ్యయాగాన్ని నిర్వహించటానికి వేదవేదాంగ వేత్తలైన ఎందరో పండితులు విచ్చేసారు. శాస్త్రబద్ధంగా నయనానందకరంగా అశ్వమేధయాగం కొనసాగింది. యాగసందర్భంగా ఇంద్రద్యుమ్నుడు విరివిగా దానధర్మాలు చేసాడు. వచ్చిన వారందరినీ తగిన రీతిలో గౌరవించి షడ్రసోపేతమైన విందు భోజనాన్ని ఏర్పాటు చేసాడు. అంగరంగ వైభవంగా సాగిన ఆ మహాయజ్ఞాన్ని చూసి, దేవతలు, సిద్ధులు, మహర్షులు ఎంతో ఆశ్చర్యపోయారు.

ఆ విధంగా అశ్వమేధయాగాన్ని నిర్విఘ్నంగా పరిసమాప్తి చేసాడు ఇంద్రద్యుమ్నుడు. యాగానికి విచ్చేసిన ప్రతి ఒక్కరికీ విలువైన కానుకల్ని సమర్పించాడు. యాగం వైభవంగా పూర్తయ్యింది. అందరూ యథాస్థానాలకి వెళ్ళిపోయారు. ఇంద్ర్యుమ్నుడికి చింత మొదలయ్యింది. "ఇంత వరకూ శ్రీమహావిష్ణువు ప్రతిమను నిర్మించటానికి తగిన శిల దొరకలేదు. సృష్టి, స్థితి, లయకారుడైన ఆ పరమాత్మ ఉనికిని నేనెలా తెలుసుకోగలను? అసలు విష్ణుమూర్తి ప్రతిమని రాతితో చేస్తే మంచిదా! మట్టితో నిర్మిస్తే మంచిదా! లేక కొయ్యతోచేస్తే బావుంటుందా? ఎలాంటి వస్తువుతో ప్రతిమని చేస్తే స్వామి సంతోషిస్తాడు?" అని పరిపరివిధాలుగా ఆలోచించసాగాడు.

ఒకనాడు ఉదయం తన ప్రయత్నం సరిపోదని అందుకు వాసుదేవుడి అనుగ్రహం తప్పనిసరిగా వుండాలని భావించి పాంచరాత్ర విధానంలో పురుషోత్తమ దేవుణ్ణి పూజించాడు. పూజానంతరం భక్తితో, ఆర్తితో వాసుదేవుణ్ణి ఇలా స్తుతించాడు –

## వాసుదేవస్తుతి

వాసుదేవ! నమస్తేఽస్తు నమస్తే మోక్షకారణ ।
త్రాహిమాం సర్వలోకేశ జన్మసంసార సాగరాత్ ॥

నిర్మలాంబర సంకాశ నమస్తే పురుషోత్తమ ।
సంకర్షణ నమస్తే ఽస్తు త్రాహిమాం ధరణీధరా ॥

నమస్తే హేమగర్భాభ నమస్తే మకర ధ్వజ ।
రతికాంత నమస్తే ఽస్తు త్రాహిమాం సంవరాంతక ॥

నమస్తే ఽజన సంకాశ నమస్తే భక్తవత్సల ।
అనిరుద్ధ నమస్తే ఽస్తు త్రాహిమాం వరదో భవ ॥

నమస్తే విబుధావాస నమస్తే విబుధప్రియ ।
నారాయణ నమస్తేఽస్తు త్రాహిమాం శరణాగతమ్ ॥

నమస్తే బలినాం శ్రేష్ఠ నమస్తే లాంగలాయుధ ।
చతుర్ముఖ జగద్ధామ త్రాహిమాం ప్రపితామహ ॥

నమస్తే నీలమేఘాయ నమస్తే త్రిదశార్చిత ।
త్రాహి విష్ణో జగన్నాథ మగ్నే మాం భవసాగరే ॥

ప్రళయానల సంకాశ నమస్తే దితిజాంతక ।
నరసింహ మహావీర్య త్రాహిమాం దీప్త లోచన ॥

యథా రసాతలాదుర్వ త్వయా దంష్ట్రోద్ధృతా పురా ।
తథా మహావరాహస్త్వం త్రాహిమాం దుఃఖసాగరాత్ ॥

తవైతా మూర్తయః కృష్ణ వరదాః సంస్తుతా మయా ।
తవేమే బలదేవాద్యాః పృథగ్రూపేణ సంస్థితాః ॥
అంగాని తవ దేవేశ గరుడ్మాద్యా స్తథా ప్రభో ।
దిక్పాలాః సాయుధాశ్చైవ కేశవాద్యా స్తథాఽచ్యుత ॥

ఈ విధంగా వాసుదేవుణ్ణి ఆర్తిగా స్తుతించిన ఇంద్రద్యుమ్నుడు స్వామిపూజచేసిన ప్రదేశంలోనే దర్భలు దానిమీద వస్త్రాన్ని పరుచుకుని శ్రీహరిమీద మనసులగ్నం చేసి, ఆరాత్రి అక్కడే నిద్రపోయాడు. ఇంద్రద్యుమ్నుడి ఆశ నెరవేరింది. అతడి ఆర్తికి కరిగిపోయిన వాసుదేవుడు శంఖచక్రగదా ధారుడై అతడికి స్వప్నంలో కనిపించాడు. గరుత్మంతుడి మీద ఆసీనుడై వచ్చిన వాసుదేవుడు ఎనిమిది చేతులతో దర్శనమిచ్చాడు. తననే ఆనందంగా చూస్తున్న ఇంద్రద్యుమ్నుడితో “ఇంద్రద్యుమ్నా! ఎందుకు నీవు పరితపిస్తావు? నీవు దొరకాలి అనుకున్న జగన్నాథుడి ప్రతిమ అత్యంత పురాతనమైనది. జగత్పూజ్యమైనది. దాన్ని నీవు తిరిగి ప్రతిష్ఠించాలనుకుంటున్నావు. అయితే అది సాధ్యంకాదు. ఒకానొక కారణంచేత ఆనాటి విగ్రహాన్ని నేనే అదృశ్యం చేసాను. అయితే అంతటి మహిమాన్వితమైన ప్రతిమని ప్రతిష్ఠించే అదృష్టాన్ని నీకు కలుగచేస్తున్నాను.

రేపు సూర్యోదయం కాగానే గొడ్డలితీసుకుని బయలుదేరు. ఈ సముద్ర జలాలకి అల్లంత దూరంలో చెలయలికట్టని అనుకుని ఒక చెట్లగుబురు నీకు కనిపిస్తుంది. దానికి అవతలి గట్టున ఒకచెట్టు నీళ్ళని తాకుతూ వుంటుంది. అలల తాకిడికి గురైనప్పటికీ ఆ చెట్టు ఏమాత్రం కనిపించదు. నీవు ఏమాత్రం భయపడకుండా నీ స్వహస్తాలతో ఆ చెట్టుని సరిగ్గా గమనించి నరుకు. దివ్యమైన ఆ వృక్షం కలపతో జగన్నాథుడి దివ్యప్రతిమని తయారు చేయించు. ఇక వేరే ఏ ఆలోచనా చేయకు” అని ప్రబోధించి అదృశ్యమయ్యాడు వాసుదేవుడు.

ఇంద్రద్యుమ్నుడు ఉదయాన్నే నిద్రలేచి తనకు గతరాత్రి వచ్చిన స్వప్నాన్ని గుర్తుతెచ్చుకుని ఎంతో ఆశ్చర్యపోయాడు. వెంటనే కాలకృత్యాలు తీర్చుకుని విష్ణుసూక్తాన్ని పారాయణచేసి ఒంటరిగా గొడ్డలి తీసుకుని బయలుదేరాడు.

కలలో స్వామి చెప్పిన గుర్తుల ప్రకారం బయలుదేరాడు. కలలో స్వామి చెప్పిన గుర్తుల ప్రకారం అక్కడికి వెళ్ళి దివ్యవృక్షాన్ని చూసాడు. ఏమాత్రం సందేహించకుండా ఉన్నతంగా, బలిష్ఠంగా వున్న ఆ మహావృక్షాన్ని గొడ్డలితో రెండు ముక్కలుగా నరికాడు. ఎర్రటి రంగులో వున్న ఆ దివ్యవృక్షం ఏ జాతికి చెందినదో అతడికి తెలియలేదు. అంతలో శ్రీహరి, దేవశిల్పి విశ్వకర్మ, ఇద్దరూ విప్రుల వేషాన్ని ధరించి అక్కడికి వచ్చారు. వారిద్దరూ ఒకే రూపంతో ప్రకాశిస్తున్నారు. దివ్యమాలలు, హారాలు ధరించారు. తమ ఎదురుగా వున్న ఇంద్రద్యుమ్నుడితో మహారాజా ఇక్కడ మీరేం చేస్తున్నారు? ఇది మహావృక్షం కదా ఎందుకు దీన్ని నరికారు? అని ప్రశ్నించారు. వారిద్దరి మాటలు విని "విప్రులారా! నేను శ్రీమహావిష్ణువు ప్రతిమని నిర్మించి దాన్ని ఈ పవిత్ర పురుషోత్తమక్షేత్రంలో ప్రతిష్ఠించాలని సంకల్పించుకున్నాను. నిన్న రాత్రి కలలో వాసుదేవుడు నాకు కనుపించి ఆనవాలు చెప్పి ఇదిగో ఈ వృక్షాన్నే నరికి దానితో తన ప్రతిమని నిర్మించుకోమని చెప్పాడు" అని సమాధానం చెప్పాడు ఇంద్రద్యుమ్నుడు.

రాజు మాటలు విన్న శ్రీహరి చిద్విలాసంగా నవ్వుతూ రాజా! నీ సంకల్పం చాలా గొప్పది. ఎంతో మందిని తరింపచేయాలన్న నిస్వార్థమైన నీకోరిక ఎంతో ప్రశంసనీయమైనది. ఇదిగో నీతో వచ్చినవాడు శిల్పచాతుర్యం కలిగినవాడు. నీవుకోరిన విధంగా విష్ణుప్రతిమని ఇతడు చేస్తాడు. నువ్విటురా! మనిద్దరం ఆ చెట్టునీడలో విశ్రమిద్దాం" అన్నాడు. రాజు ఇవతలకి వచ్చాడు. వెంటనే శ్రీహరి విశ్వకర్మతో తామరరేకుల్లాంటి కళ్ళు, హృదయం మీద శ్రీవత్సం కౌస్తుభం, చేతుల్లో శంఖ, చక్ర, గదా, శార్ఙాలు, వీటితో ఒక విగ్రహం, పాలలా తెల్లగా స్వస్తికముద్రని, నాగలిని చేతిలో ధరించిన బలరామమూర్తిని ఒకటి, వాసుదేవుడి చెల్లెలయిన సుభద్రాదేవి ప్రతిమనొకటి ఇలా మొత్తం మూడు ప్రతిమలు తయారుచేయి అని పురమాయించాడు.

శ్రీహరి ఆజ్ఞప్రకారం అతికొద్ది సమయంలోనే మూడు ప్రతిమల్ని ఆయన కోరిన విధంగా తయారుచేసాడు విశ్వకర్మ. దివ్యలక్షణాలతో సర్వాంగ

సుందరంగా ప్రకాశిస్తున్న ఆ అద్భుత'దారు ప్రతిమల్ని' చూసి ఇంద్రద్యుమ్నుడు ఎంతో ఆశ్చర్యపోయాడు. అతి కొద్ది సమయంలో ఇంత అందమైన ప్రతిమల్ని తయారుచేయటం మానవ మాత్రులకు సాధ్యంకానిపని. ఇదేదో దైవమాయలా వుంది" అని గ్రహించాడు. వెంటనే వారిద్దరి దగ్గరకి వచ్చి "స్వామీ! మీరు సామాన్యులు కాదు! అసామాన్యులుగా కనిపిస్తున్నారు అసలు మీరెవరు? యక్షులా గంధర్వులా! బ్రహ్మ విష్ణువులా! లేక అశ్వినీకుమారులా! దయచేసి మీ స్వరూపాన్ని తెలియచేయండి"అని ప్రార్థించాడు ఇంద్రద్యుమ్నుడు

మహారాజా! నేను గంధర్వుణ్ణీ, యక్షుణ్ణీ బ్రహ్మారుద్రాది ఇతర దేవతల్నీకాను. నేను పురుషోత్తముణ్ణి సకల పాపాల్నీ హరించేశక్తి సామర్థ్యాలు కలిగిన వాడిని, సకల జీవకోటికీ ఆరాధనీయుణ్ణి. సకలయోగులు జ్ఞానగమ్యుడనీ, వాసుదేవుడనీ, ఎవరిని పేర్కొంటాయో ఆ పరమాత్మని నేనే. త్రిమూర్తి స్వరూపం కూడా నాదే. అఖిలచరాచర జగత్తు నా స్వరూపమే. నాకంటే వేరేదేదీ లేదు. నీవెంతో పుణ్యాత్ముడివి దృఢదీక్ష కలిగినవాడివి. అందుకే నీకు నేను ప్రత్యక్షంగా దర్శనమిచ్చాను. నీవు యోగ్యుడివి కాబట్టే నన్ను చూడగలిగావు" అని పలికాడు మహావిష్ణువు. శ్రీహరి మాటలు విని ఆనందంతో ఒళ్ళంతా పులకరించిపోగా స్వామిని పరిపరి విధాలుగా ప్రార్థించాడు. ఇంద్రద్యుమ్నుడి స్తుతి విన్న వాసుదేవుడు ఎంతో ఆనందించి అతడితో–

"ఇంద్రద్యుమ్నా! నీకు శుభం కలుగుగాక! నా అనుగ్రహం నీకు ఎల్లప్పుడూ వుంటుంది. నీవు పదివేల తొమ్మిదివందల సంవత్సరాలు పాలిస్తావు. ఆ తరువాత నా దివ్య పదాన్ని చేరుకుంటావు. నీ కీర్తి శాశ్వతంగా ఈ లోకంలో నిలిచిపోతుంది. నీ పేరుతో ఇంద్రద్యుమ్మ సరస్సు అని ఒకటి ఇక్కడ ఏర్పడుతుంది. ఈ సరస్సులో స్నానం చేసినవాడికి ఇంద్రలోక ప్రాప్తి కలుగుతుంది. ఇక్కడ పిండ ప్రదానం చేస్తే చేసినవాడికి ఇరవై తరాలవారు స్వర్గానికి చేరుకుంటారు" అని వాసుదేవుడు ఇంద్రద్యుమ్నుడికి వరమిచ్చి విశ్వకర్మతో సహా అంతర్థానమయ్యాడు.

ఇంద్రద్యుమ్నుడు తన జన్మ చరితార్థమైనదని భావించి జగన్నాథుడైన బలరామ, కృష్ణ సుభద్రల ప్రతిమల్ని ఒక మట్టి రథం మీద ఎక్కించి వాటిని ఘనంగా ఊరేగించి, మంత్రి పురోహిత పండితుల సమక్షంలో శాస్త్రోక్తంగా వాటిని తాను నిర్మించిన ఆలయంలో ప్రతిష్ఠించాడు. తరువాత అందరికీ దానధర్మాలు చేసాడు. వాసుదేవుడు చెప్పినంత కాలం పాలించి చివరికి ఆయన లోకాన్నే చేరుకున్నాడు ఇంద్రద్యుమ్నుడు. ఆనాటి నుంచి నేటివరకూ పురుషోత్తమక్షేత్రం క్షేత్రరాజంగా ప్రసిద్ధిచెందింది.

కురుక్షేత్రంలో నిరాహారంగా ఒంటికాలి మీద నుంచుని డెబ్భైవేల సంవత్సరాలు తపస్సు చేస్తే ఎంతఫలం లభిస్తుందో అంతటిఫలం ఈ దివ్యక్షేత్రంలో జ్యేష్ఠ శుద్ధ దశమినాడు ఉపవాసం వుండి జగనాథుణ్ణి దర్శిస్తే చాలు లభిస్తుంది. ఈ జ్యేష్ఠ మాసంలోనే పంచతీర్థ యాత్రచేసి, శుద్ధద్వాదశినాడు జగన్నాథుణ్ణి దర్శించుకోవాలి. అలాచేసిన వాడికి శాశ్వతంగా విష్ణులోక ప్రాప్తి కలుగుతుంది. దూరాన ఉన్న వారైనా ఒక్కసారి మనసారా జగన్నాథుణ్ణి స్మరిస్తే చాలు స్వామి అనుగ్రహం లభిస్తుంది. కేవలం స్వామి ఆలయశిఖరాన్ని చూసినా పుణ్యం లభిస్తుంది.

## మార్కండేయ మహర్షి వటవృక్షాన్ని దర్శించటం

పూర్వం కల్పాంతంలో మహాప్రళయం సంభవించింది. ఆ ప్రళయంలో సూర్య చంద్రులు, వాయువు, చరాచర ప్రపంచమంతా నశించింది. ప్రళయ జ్వాలలతో ఆదిత్యుడు ఆవిర్భవించాడు. భయంకరమైన కాలమేఘాలు పిడుగుల్ని వర్షించి చెట్లని గుడ్లని ఛిన్నా భిన్నం చేసాయి. పంచభానుడి వేడికి తాళలేక భూమండలమంతా ఎండిపోయింది. నదులు సరస్సులు, సముద్రాలు పూర్తిగా ఇంకిపోయాయి. ఈ కాలాగ్ని భూమిని దాటి క్రిందవున్న అన్నిలోకాల్నీ దహించేసింది. అక్కడినుంచి పైకి లేచిన ప్రచండాగ్ని పైనున్న లోకాల్ని కూడా దహించటం ప్రారంభించింది.

మహాభయంకరంగా వున్న ఆ ప్రళయకాలంలో మార్కండేయుడనే మహర్షి ధ్యాననిష్ఠలో వున్నాడు. ఆయన పరమధర్మాత్ముడు, నిష్ఠాగరిష్ఠుడు,

గొప్ప తపస్వి, ఆకలి దప్పికల్ని సైతం ఓర్చుకుని, ఇంద్రియాల్ని తన అదుపులో వుంచుకోగలిగిన ఆ మహర్షి ప్రళయకాల అగ్ని ప్రభావానికి గురయ్యాడు. దానివల్ల ఆయన కంఠం, పెదాలు, నాలుక ఎండిపోయాయి. ఎంతో భయపడుతూ భూమండలం మీద తలదాచుకోవటానికి తగిన ప్రదేశం కోసం వెతుకుతున్నాడు. ఎక్కడా తగిన స్థలం ఆయనకి కనిపించలేదు. అన్యథా శరణం నాస్తి అని నారాయణుణ్ణి శరణువేడాడు. ఆయనకి తగినస్థలం స్ఫురించింది. వెంటనే పురుషోత్తమ క్షేత్రంలో వున్న ఆ మహావటవృక్షం దగ్గరకి చేరాడు. అది సాక్షాత్తు విష్ణు స్వరూపమైన వృక్షం కాబట్టి ప్రళయకాలంలో కూడా చెక్కుచెదరకుండా స్థిరంగా వుంది. ఆ వృక్షం నీడలో మార్కండేయుడు అలసిపోయి హాయిగా నిద్రపోయాడు.

**మార్కండేయుడు ప్రళయాన్ని చూడటం :** హాయిగా ఒళ్ళు మరచి నిద్రపోయిన మార్కండేయమహర్షి స్వప్నంలో ఈ విధంగా మహాప్రళయాన్ని దర్శించాడు. పెద్ద పెద్ద ఏనుగుల్లాగా, మెరుపులతో మెరిసే మేఘాలు వింత వింతగా ఆకాశమంతా అలుముకున్నాయి. వాటిలో కొన్ని నల్లగా, కొన్ని ఎర్రగా, మరికొన్ని ఆకుపచ్చగా, ఇంకొన్ని పసుపు పచ్చగా వున్నాయి. కొన్ని పెద్ద పెద్ద నగరాల్లాగా, మరికొన్ని నల్లటి కాటుక కొండల్లాగా ఆకాశమంతా కమ్ముకున్నాయి. ఒక్కసారిగా ఆ మేఘాలన్నీ వర్షించటం ప్రారంభించాయి. కుండపోతగా కురుస్తున్న ఆ వర్షధారలతో దిక్కులన్నీ నిండి పోయాయి. దానితో అప్పటిదాకా తాపంతో వేడెక్కి పోయిన భూమండలం కాస్త చల్లారింది.

ఆవిధంగా కాలమేఘాలు 12 సంవత్సరాల పాటు నిరాటంకంగా వర్షించాయి. ఆ కారణంగా సముద్రాల చెలియలికట్టలు తెగి భూమినంతా ముంచెత్తాయి. పర్వతాలు తడిసి తడిసి పిండైపోయాయి. క్రమంగా భూమండలమంతా నీటిలో మునిగిపోయింది. అప్పుడొక విచిత్రం జరిగింది. పెద్ద పెనుగాలి ఆగకుండా కొన్ని రోజుల పాటు వీచింది. ఆ గాలి తాకిడికి పర్వతాల్లాంటి మేఘాలు దూది పింజాల్లాగా ఎగిరిపోయాయి. ఆ సమయంలో

శ్రీమహావిష్ణువు ప్రళయకాల గాలుల్ని తోసేసి ఆ మహాసముద్రం మీద హాయిగా నిద్రపోయాడు. ఆయన నిద్రపోవటంతో సకల జీవకోటీ నశించిపోయింది.

ఒక్కసారిగా మార్కండేయమహర్షికి మెలకువవచ్చింది. కళ్ళు తెరిచి చూసాడు. భూమి అంతా నీటితో నిండిపోయి కనిపించింది. అంతకు ముందు దాకా వున్న వటవృక్షం లేదు, భూమీలేదు, సూర్యచంద్రులు లేరు అగ్ని, గాలి, ఏవీలేవు. అంతా కారు చీకటి ఎటుచూసినా నీరే. వేరే దారేదీ కనిపించటంలేదు. మార్కండేయుడు ప్రాణాలు ఎలాగైనా కాపాడుకోవాలని ఆ నీటిలో ఈదటం ప్రారంభించాడు. ఈదుతూనే వున్నాడు. అలసట వచ్చింది. శక్తి చాలటం లేదు. మనసులో పురషోత్తముణ్ణి ఎడతెరిపి లేకుండా ధ్యానిస్తున్నాడు. ఆయన ధ్యానానికి తృప్తి చెందిన పురషోత్తముడు, నీళ్ళలో అటూ ఇటూ దారినపడక తిరగుతున్న మార్కండేయుడితో వత్సా! బాగా అలసి పోయావు. ఇటురా! ఏం భయపడకు నేనున్నాను ఇటురా" అని పిలిచాడు నారాయణుడు.

ఆ మాటలు విన్న మర్కాండేయుడికి కోపం వచ్చింది. "ఎవడు వీడు నాకన్నా చిన్నవాడు నన్ను వత్సా! అని పిలిచి అవమానిస్తున్నాడు. దేవతల్లో కూడా ఎవరూ నన్నిలా కించపరిచి మాట్లాడలేదే! అని మాయ కమ్మి తనలో తాను అనుకున్నాడు. వెంటనే అసలిది కలా! నిజమా! భ్రాంతా! లేక మోహమా! అనిపించింది. ఒక్కక్షణం నిశ్చల మనసుతో ధ్యానం చేసాడు. పురుషోత్తముడిని శరణువేడుకున్నాడు. కళ్ళు తెరిచేసరికి ఎదురుగా నీటిమీద విశాలమైన వటవృక్షం కనిపించింది. ఆ మర్రి చెట్టు కొమ్మలమీద విశాలంగా పరుచుకున్న అందమైన తల్పం వుంది. వజ్ర వైఢూర్యాలతో, నానారత్నాలతో పొదగబడి నిర్మించబడింది. ఆ దివ్య పర్యంకం మీద కోటి సూర్యప్రభలతో వెలుగొందే తేజమూర్తిని, చతుర్భుజుడిని వనమాలాలంకృత వక్షస్థలం కలిగినవాణ్ణి, దివ్యకుండలాలతో వెలుగొందేవాడు అయిన బాలకృష్ణుణ్ణి దర్శించాడు.

మార్కండేయుడికి ఎంతో ఆశ్చర్యం కలిగింది. 'ఆహా! ఎవడీబాలుడు ఇంత నిర్జన ప్రదేశంలో ఏమాత్రం భయంలేకుండా ఆడుకుంటున్నాడు" అని

అనుకున్నాడు. భూత భవిష్యత్తులు తెలుసుకోగలిగిన ఆ మార్కండేయుడు మాయాప్రభావం వల్ల ఆ బాలుడి నిజస్వరూపాన్ని తెలుసుకోలేకపోయాడు. ఎంత ప్రయత్నించినా ఆ బాలుడు ఎవరు?అన్న విషయం ఆయనకి స్ఫురించలేదు. నెమ్మదిగా ఆ బాలుడి వైపు వెళ్ళాడు. అంతలో వింతగా ఆ బాలుడి నోటి నుంచి" వత్సా! ఇప్పటిదాకా తిరిగీతిరిగీ ఎంతో అలసిపోయావు. నిన్ను కాపాడాలనే వచ్చాను. రా, నా శరీరంలోకి ప్రవేశించు అక్కడ నీకు సంపూర్ణ విశ్రాంతి దొరుకుతుంది" అన్న మాటలు వినిపించాయి. మార్కండేయుడు మరేమీ ఆలోచించే స్థితిలో లేడు. మంత్రం వేసిన వాడిలా ఆ బాలుడు తెరిచిన నోటినుంచి లోపలికి ప్రవేశించాడు.

**మార్కండేయుడు చూసిన అద్భుతాలు :** మర్రి ఆకుమీద శయనించిన బాలుడి నోటిద్వారా సరాసరి గర్భంలోకి ప్రవేశించాడు మార్కండేయ మహర్షి. అక్కడ ఆయనకి సమస్త భూమండలం కనిపించింది. సప్తసముద్రాలు, సప్తద్వీపాలు, సప్త కులపర్వతాలు, మేరు పర్వతం లాంటి వెన్నో దర్శించాడు. మేరు పర్వతం మహోన్నతమైనది ఇంద్రాది దేవతలు, సిద్ధులు చారణులు, గంధర్వులు, అప్సరసలు ఆపర్వతం మీద సంచరిస్తూ వుంటారు. మార్కండేయుడు ఆ మేరుపర్వతాన్ని అలానే చూస్తూ ఆ బాలుడి ఉదరంలోనే క్రమంగా కురుక్షేత్రాది పుణ్యక్షేత్రాలు, పుణ్యనదులు, దివ్యతీర్థాలు, రకరకాల వృత్తుల్ని చేస్తున్న మానవులు, జనావాసాలతో నిండిపోయిన నగరాలు, ఇలా ఇదీ అదీ అనకుండా సకల దృశ్యాల్ని చూసాడు.

మార్కండేయుడు భూమిమీద ఉన్న వాటినే కాదు, అతల, వితల, సుతల, రసాతల, మహాతల, తలాతల, పాతాళ లోకాల్ని, భూ, భువర్, సువర్ లోకాల్ని కూడా దర్శించాడు. అలా లోపల నిర్విరామంగా తిరుగుతున్న మార్కండేయుడికి ఎక్కడా శ్రీమహావిష్ణువు శరీరం కనిపించలేదు. వెంటనే భక్తిగా ఆయన్ని ప్రార్థించాడు. అంతే! ఒక్కసారిగా ఆ బాలుడు నోరు తెరిచాడు వెంటనే లోపల నుంచి బైట పడ్డాడు మార్కండేయుడు.

తిరిగిచూస్తే యథాప్రకారంగా మర్రి కొమ్మ మీద ఆకులో విశ్రమించిన బాలుడు కనిపించాడు. అటు ఇటూ చూసాడు. అంతకుముందున్నట్టుగానే అంతా సముద్రమే వేరే ఏదీ కనిపించలేదు. అంతలో తిరిగి ఆ బాలుడు "వత్సా! నా ఉదరంలో నీకు తగినంత విశ్రాంతి లభించిందా! లోపల ఏవే వింతలు చూసావు? నీవు నాకు పరమ భక్తుడివి. అందుకే నేను నిన్ను రక్షించాలనుకున్నాను. ఇదుగో ఇలా నా వంక చూడు" అని అన్నాడు.

**జగన్నాథస్తుతి :** బాలుడి మాటలు విన్న మార్కండేయుడికి వళ్ళు గగుర్పొడిచింది. ఆనందోద్రేకంతో వివశుడైపోయాడు. ఒక్కసారి సజల నేత్రాలతో ఆ బాలుణ్ణి తనివితీరా చూసాడు. ఆయనకి సత్యదర్శన మయ్యింది. శ్రీహరి నిజ స్వరూపాన్ని తెలుసుకోగలిగాడు. బాలుడి రూపంలో వున్నది తాను ఆరాధించే పరమాత్మేనని గ్రహించాడు. ఆ సంతోషంతో స్వామిని భక్తిగా ఇలా స్తుతించాడు.

దేవదేవ జగన్నాథ మాయా బాలవపుర్ధర ।
త్రాహి మాంచారు పద్మాక్ష దుఃఖితం శరణాగతమ్ ॥ 1

సంతప్తోఽ స్మి సురశ్రేష్ఠ సంవర్తాఖ్యేన వహ్నినా ।
అంగార వర్షభీతంచ త్రాహిమాం పురుషోత్తమ ॥ 2

శోషతశ్చ ప్రచండాన వాయునాజ్వలతామునా ।
విహ్వలోఽ హం తథా శ్రాంతస్త్రాహిమాం పురుషోత్తమ ॥ 3

తాసితశ్చతవామత్త్యైః ప్రళయావర్తకాదిభిః ।
నశాంతి మధిగచ్ఛామి త్రాహిమాం పురుషోత్తమం ॥ 4

తవోదరేచ దేవేశ మయాదృష్టో చరాచరమ్ ।
విస్మితోఽ హం విషణ్ణశ్చ త్రాహిమాం పురుషోత్తమ ॥ 5

*(శ్లో॥ 11-15, అధ్యా-55)*

దేవదేవా! జగన్నాథా! బాలకుడిగా నీవు మాయారూపాన్ని ధరించావని నేను తెలుసుకున్నాను. నన్ను దుఃఖం నుంచి కాపాడు. ప్రళయకాలంలో సంభవించిన ఈ సంవర్తాగ్ని చేత నా శరీరం ఎంతో తాపానికి గురయ్యింది.

నిప్పుల వర్షం కురిసేసరికి నాకు భయమేసింది. ప్రచండమైన వేడి గాలులకి నాకు శోష వచ్చింది. ఈ సంఘటనలతో నాకు మనశ్శాంతి కరువైపోయింది. నన్ను రక్షించు స్వామీ! నీ ఉదరంలో ప్రవేశించి నేనెంతో ఆశ్చర్యకరమైన దృశ్యాలు చూసాను. సకల చరాచర ప్రపంచాన్ని అందులోనే దర్శించాను. స్వామి నన్ను రక్షించు. నాకు తగిన మార్గాన్ని చూపించు" అని ప్రార్థించాడు.

ఈవిధంగా మార్కండేయమహర్షి చేసిన స్తుతికి జగన్నాథుడు సంతోషించాడు. "వత్సా! నీకు ఏంకావాలో కోరుకో ప్రసాదిస్తాను" అన్నాడు. స్వామీ! నీవెవరో! నీమాయ ఏమిటో? నాకు సంపూర్ణంగా తెలుసుకోవాలని వుంది దయచేసి చెప్పండి" అని కోరాడు మార్కండేయుడు.

"వత్సా! నా మాయని, నన్ను తెలుసుకోవటం దేవతలకి కూడా సాధ్యంకాదు. అయినా నీవు నా భక్తుడవు కాబట్టి చెబుతున్నా–నీవు పితృభక్తుడివి. నన్ను శరణువేడుకున్నావు. నీ బ్రహ్మచర్య దీక్ష చాలాగొప్పది" 'నారము' అనగా నీరు – 'ఆయనము' అనగా స్థానముగా కలవాడు కాబట్టి 'నారాయణుడు' అంటే నేనే. ఈ సృష్టికి కారకుణ్ణి కూడా నేనే. నాకు నాశనం అనేదే లేదు. విష్ణువు, బ్రహ్మ, శివుడు, ఇంద్రుడు, కుబేరుడు, యముడు, సూర్యుడు, చంద్రుడు, కశ్యపుడు ఇలా అన్నీ నా స్వరూపాలే. అగ్ని నాముఖం, భూమి నాకు పాదాలు, సూర్యచంద్రులు నాకు నేత్రాలు" అని తన తత్త్వాన్ని స్వరూపాన్ని గురించి వివరించాడు ఆ బాలుడిరూపంలోవున్న నారాయణుడు.

అలా వెయ్యియుగాల కాలం గడిచిపోయింది. నారాయణుడు తిరిగి మార్కండేయుణ్ణి మరో వరం కోరుకోమన్నాడు. అప్పుడాయన "స్వామీ! లోకంలో శైవవైష్ణవ భేదాలు నశించాలి. ప్రజల్లో శివకేశవులు ఒక్కరే అన్న భావన కలిగించాలి. అందుకోసం దివ్యమైన నీ పురుషోత్తమ క్షేత్రంలో ఒక శివాలయాన్ని నిర్మిస్తాను అనుగ్రహించు అని కోరాడు మార్కండేయుడు. వత్సా! మంచిది అలాగేచేయి. ఆ శివాలయాన్ని నీ పేరుతో మార్కండేశ్వరుడు అని నిర్మించు. ఆ ఆలయానికి ఉత్తర దిశలో రాబోయేకాలంలో ఒక కోనేరు ఏర్పడుతుంది.

అది కూడా మార్కండేయ హ్రదం అని నీ పేరుతోనే ప్రసిద్ధమవుతుంది. అందులో స్నానంచేసిన వారికి సకల పాపాలు హరిస్తాయి” అని వరమిచ్చి అంతర్ధాన మయ్యాడు శ్రీహరి.

## మార్కండేయ తీర్థంలో స్నానవిధి

పురుషోత్తమ క్షేత్రంలో వున్న మార్కండేయ హ్రదం (సరోవరం) చాలా పవిత్రమైనది. ఆ హ్రదంలో స్నానంచేసి ఆ పరిసరాల్లో వున్న దేవతలను దర్శిస్తే సకలశుభాలు కలుగుతాయి. అంతులేని పుణ్యఫలం లభిస్తుంది. మార్కండేయ హ్రదం దగ్గరికి వెళ్ళి ఉత్తరం వైపు తిరిగి భక్తిగా స్నానంచేసే ముందు ఈ శ్లోకాన్ని పఠించాలి.

సంసారసాగరే మగ్నం పాపగ్రస్తం అచేతనమ్ ।
త్రాహిమాం భగనేత్రఘ్న త్రిపురారే నమోఽ స్తుతే ॥

నమశ్శివాయ శాంతాయ సర్వపాపహరాయచ ।
స్నానం కరోమి దేవేశ మమనశ్యతు పాతకమ్ ॥

త్రిలోచన నమస్తేఽస్తు నమస్తే శశిభూషణ ।
త్రాహిమాంత్వం విరూపాక్ష మహాదేవనమోఽస్తుతే ॥

*(శ్లో॥ 3-5, అధ్యా-67)*

“ఓ త్రిపురహరా! సంసార సాగరంలో మునిగి పాపగ్రస్తుడివై తెలివి తప్పిన నన్ను రక్షించు. మంగళ స్వరూపుడవు, శాంతుడవు, సర్వపాపాల్నీ హరించేవాడివి అయిన నీకు నమస్కారము. త్రిలోచనా! శశిభూషణా! నీకు నమస్కారం. ఓ విరూపాక్షా! నీకు నమస్కారం. నేను స్నానం చేస్తున్నాను నా పాపాలన్నిటినీ శమింపచేయండి” అని ప్రార్థించాలి.

ఈ విధంగా శ్లోకాన్ని పఠించిన తరువాత ఆ హ్రదంలోకి దిగి స్నానం చేయాలి. బొడ్డులోతు నీళ్ళలో నిలబడి యథావిధిగా పితృదేవతలకు, దేవతలకు, ఋషులకు తర్పణాలివ్వాలి. హ్రదం నుంచి బైటికి వచ్చి అక్కడేవున్న మార్కండేశ్వర దేవాలయానికి వెళ్ళి ముందుగా మూడు ప్రదక్షిణలు చేయాలి.

ఆ తరువాత ఆలయంలోకి వెళ్ళి అఘోరమంత్రాన్ని చదువుతూ (అఘోరేభ్యో ధఘోరేభ్యో ఘోర ఘోర తరేభ్యః సర్వేభ్య స్సర్వే సర్వేభ్యో నమస్తేఽస్తు రుద్ర రూపేభ్యః) మార్కండేశ్వర స్వామిని పూజించి సాష్టాంగ నమస్కారం చేయాలి.

**స్నానమహిమ :** ఈ విధంగా మార్కండేయ హ్రదంలో స్నానంచేసి, మార్కండేశ్వర స్వామిని భక్తి శ్రద్ధలతో ఆరాధించినవాడికి పది అశ్వమేధయాగాలు చేసిన ఫలితం లభిస్తుంది. మరణానంతరం అతడు శివలోకాన్ని చేరుకుంటాడు. అక్కడే మహాభోగాలు అనుభవించి తిరిగి కొత్తయుగంలో ఇదేభూమిలో విప్రుడుగా జన్మిస్తాడు. వేదవేదాంగాలని అభ్యసించి క్రమంగా శివసాయుజ్యాన్ని పొందుతాడు.

## కల్పవృక్షం (మర్రిచెట్టు) నమస్కార విధి

పురుషోత్తమక్షేత్రానికి వెళ్ళిన భక్తుడు సాక్షాత్తు శ్రీమహావిష్ణువు కొలువైవున్న మర్రిచెట్టుని దర్శించాలి. కల్పాంతంలో కూడా నశించని ఆ దివ్యవృక్షాన్ని నమస్కరించి

ఓం నమో అవ్యక్తరూపాయ మహాప్రళయకారిణీ ।
మహద్ర సోపవిష్టాయ న్యగ్రోధాయ నమోస్తుతే ॥
అమరస్త్వం సదాకల్పే హరేశ్చాయతనం వట ।
న్యగ్రోధ హరమే పాపం కల్పవృక్ష నమోస్తుతే ॥

*(శ్లో॥ 13-14, అధ్యా -57)*

'ఓ కల్పవృక్షమా! అవ్యక్తంగా పరమాత్మ ధరించిన వ్యక్తరూపానివి నీవు. నీవే ముక్తి నిచ్చేదానివి. కల్పాంతంలో కూడా నశించని గొప్పదానివి. సాక్షాత్తు శ్రీహరికి నివాసమైన నీవు నా పాపాల్ని హరించు' అని ప్రార్థించి ఆ చెట్టు చుట్టూ మూడు సార్లు ప్రదక్షిణ చేయాలి.

**వటవృక్షమహిమ :** ఈవిధంగా వటవృక్షానికి భక్తిగా నమస్కరించి ప్రదక్షిణ చేసినవాడికి అతడు చేసిన పాపాలు, పాము కుబుసం విడిచినట్టుగా విడిపోతాయి.

ఆ కల్పవృక్షం నీడలో కొద్దిసేపు విశ్రమిస్తే చాలు బ్రహ్మహత్యా పాపాలు కూడా తొలగిపోతాయి. ఇక సామాన్యమైన పాపాల గురించి చెప్పేదేముంది. సాక్షాత్తు నారాయణుడు కొలువున్న ఆ వటవృక్షానికి నమస్కరించినవాడు రాజసూయ యాగం చేసిన ఫలితాన్ని పొందుతాడు. జీవించినంతకాలం తన వంశాన్ని ఉద్ధరించి వైకుంఠధామానికి చేరుకుంటాడు.

వటవృక్షాన్ని దర్శించి నమస్కరించిన తరువాత భక్తుడు ఆలయంలో వున్న గరుత్మంతుడికి ముందుగా మ్రొక్కాలి. తరువాత పురుషోత్తముడైన శ్రీకృష్ణుడిని బలరాముణ్ణి, సుభద్రను దర్శించాలి. అలా చేసినవాడికి ఉత్తమలోకాలు లభిస్తాయి. ఆలయంలో స్వామిప్రక్కన కొలువున్న బలరామ దేవుణ్ణి సంకర్షణ మంత్రాన్ని పఠించి ఇలా పఠించి ప్రసన్నం చేసుకోవాలి.

**బలరామస్తుతి :**

నమస్తే హలధృగ్రామ నమస్తే ముసలాయుధ ।
నమస్తే రేవతీకాంత నమస్తే భక్తవత్సల ॥

నమస్తే బలినాంశ్రేష్ఠ నమస్తే ధరణీధర ।
ప్రలంబారే నమస్తేఽ స్తు త్రాహిమాం కృష్ణపూర్వజ ॥

*(శ్లో॥ 22-23, అధ్యా 57)*

నాగలి ధరించిన బలరామా నీకు నమస్కారం. ముసలాయుధాన్ని (రోకలిని) ధరించినవాడా, రేవతీ ప్రియా, భక్త వత్సలా, అమిత బలవంతుడా, ధరణీధరా, ప్రలంబాసురుణ్ణి సంహరించినవాడా శ్రీకృష్ణుడికి అగ్రజుడా నీకు నమస్కరిస్తున్నాను. నన్ను రక్షించు అని ప్రార్థించాలి. ఆ తరువాత ప్రధానమూర్తి అయిన శ్రీకృష్ణమూర్తిని

**శ్రీకృష్ణస్తుతి :**

జయకృష్ణ జగన్నాథ జయసర్వాఘ నాశన ।
జయ చాణూర కేశిఘ్న జయకంసని షూదన ॥

జయ పద్మపలాశాక్ష జయచక్ర గదాధర ।
జయ నీలాంబుద శ్యామ జయసర్వసుఖప్రద ॥
జయదేవజగత్పూజ్య జయసంసార నాశన ।
జయలోకపతే నాథ జయవాంఛా ఫలప్రద ॥

*(శ్లో॥ 33-35, అధ్యా-57)*

జగన్నాథుడవైన శ్రీకృష్ణా! నీకు జయంకలుగు గాక! సర్వపాపలనీ నాశనం చేసే, చాణూరుడు, కేశి, కంసాది అసురుల్ని రక్షించిన, పద్మాల్లాంటి నేత్రాలు కలిగిన, చక్రాన్ని, గదని ధరించి, లోకాలకి నాథుడుగా వున్న, నీలపద్మంలాంటి శరీరవర్ణం కలిగిన, సకల సుఖాల్ని ప్రసాదించగలిగిన జగత్తు చేత పూజించబడిన, సంసార భయాన్ని నాశనంచేసిన, అన్ని కోరికలు సఫలం చేసే ఓ శ్రీకృష్ణా! పరంధామా! నీకు జయమగు గాక! ఈ విధంగా ప్రార్థించి శ్రీకృష్ణుడికి భక్తిగా నమస్కరించాలి.

ఈ విధంగా పురుషోత్తముణ్ణి ప్రసన్నం చేసుకున్నవాడు సకల పాపాలనుంచీ విముక్తుడై విష్ణులోకానికి చేరుకుంటాడు. ప్రళయకాలందాకా అక్కడే సుఖభోగాలు అనుభవించాలి. ప్రళయానంతరం సకలశాస్త్ర పారంగతుడైన విప్రుడుగా తిరిగి జన్మిస్తాడు. శ్రీహరిని ద్వాదశాక్షర మహామంత్రంతో పూజించి తిరిగి సద్గతుల్ని పొందుతాడు. ఇక్కడి శ్రీకృష్ణుణ్ణి దర్శించినంతనే సర్వతీర్థాలలో స్నానం చేసిన ఫలితం లభిస్తుంది. ఇలా బలరామకృష్ణుల్ని ధ్యానించిన తరువాత వారి ప్రక్కనే వున్న సుభద్రాదేవిని దర్శించి భక్తి పూర్వకంగా ఆమెకి నమస్కరించి –

**సుభద్రాస్తుతి :**

నమస్తే సర్వగేదేవి నమస్తే శుభసౌఖ్యదే ।
త్రాహిమాం పద్మ పత్రాక్షికాత్యాయని నమోஉస్తుతే ॥
ఏవం ప్రసాద్యతాం దేవీం జగద్ధాత్రీం జగద్ధితాం ।
బలదేవస్య భగినీం సుభద్రాం వరదాం శివాం ॥

*(శ్లో॥ 59-60, అధ్యా-57)*

అని పఠించాలి. ఆవిధంగా సుభద్రాదేవి అనుగ్రహాన్ని పొందినవాడు కామగమన విమానాన్ని ఎక్కి విష్ణులోకానికి చేరుకుంటాడు. ప్రళయకాలం దాకా అక్కడే భోగాలు అనుభవించి, తిరిగి వేదవేత్తగా జన్మిస్తాడు.

ఈ విధంగా బలరామకృష్ణులతో పాటు సుభద్రాదేవిని దర్శించిన భక్తులకి ధర్మార్థకామ మోక్షాలు నాలుగూ లభిస్తాయి. తరువాత దేవాలయం వెలుపలకి వచ్చి అక్కడ ఇసుకలో అంతర్నిహితమై ఉన్న ఇంద్రనీలమణి స్వరూపుడైన శ్రీహరిని దర్శించాలి. అలా చేసిన వాడు వైకుంఠధామానికి చేరుకుంటాడు.

## నృసింహోపాసన మాహాత్మ్యం

పురుషోత్తమ క్షేత్రంలో కొలువైన మరో దేవత నృసింహస్వామి. ఆయన సకలదేవతామయుడు. ఆయన్ని దర్శించినవాడు పాపాలనుంచి విముక్తి పొందుతాడు. నరసింహస్వామి భక్తులకి లోకంలో అసాధ్యం అనేదేదీ వుండదు. ఆయన సకల పురుషార్థాలనీ ప్రసాదిస్తాడు.

**నృసింహోపాసన :** నృసింహస్వామిని ఉపాసించేవారు ఆకులు, దుంపలు, యవలు, పళ్ళు, పేలాలపిండి, నీరు మాత్రమే ఆహారంగా స్వీకరించాలి. సాధన చేసేవాడు పట్టు గోచీని మాత్రమే ఆచ్ఛాదనగా ధరించి, అరణ్యాలలోగానీ, పర్వతాల మీదగానీ, నదీ సంగమ ప్రదేశాలలో గానీ, ఊషర క్షేత్రాలలో గానీ, సిద్ధక్షేత్రాలలో గానీ స్వామిని ప్రతిష్ఠించి ఇంద్రియ నిగ్రహుడై కల్పంలో చెప్పిన విధానంగా పూజించాలి. శుక్లపక్ష ద్వాదశినాడు పూర్తిగా ఉపవాసం వుండి నృసింహమంత్రాన్ని ఇరవైలక్షల జపం చేయాలి. అలా చేసినవాడికి మహాపాతకాలు, ఉపపాతకాలు నశిస్తాయి.

నరసింహస్వామిని ఆరాధించేవాడు నిత్యం స్వామికి ప్రదక్షిణాలు చేసి, షోడశోపచారాలతో పూజించి నమస్కరించాలి. పచ్చకర్పూరం అద్దిన పూలని స్వామి పాదాలమీద ఉంచి వాటిని తీసుకుని తమ తలమీద ధరిస్తే శుభఫలితాలను పొందుతారు. అలా చేసిన వారికి సకలకార్య దిగ్విజయం కలుగుతుంది.

బ్రహ్మరుద్రాదులు కూడా ఆయన దివ్య తేజస్సుని సహించలేరు. ఇక మిగిలిన దేవతల గురించి చెప్పేదేముంది.

నృసింహమంత్ర జపం చేస్తే అభిచార కర్మలు, అసురమంత్ర ప్రయోగాలు తొలగిపోతాయి. మహాప్రభావవంతమైన నృసింహకవాచాన్ని ఒక్కసారి జపిస్తేచాలు సకల ఉపద్రవాల నుంచీ రక్షణ లభిస్తుంది. ఇదే కవచాన్ని రెండు సార్లు పఠిస్తే దేవదానవ, యక్ష, రాక్షస, భూతప్రేత పిశాచాల బాధలు నశిస్తాయి. అదే గనుక మూడుసార్లు జపిస్తే పన్నెండు యోజనాల దూరం వరకూ ఆ సాధకుణ్ణి ఎవరూ ఏమీ చేయలేరు.

ఆ ప్రాంతంలో నృసింహబిలం అనే పేరుతో ఒక కొండ గుహవుంది. అది మూసి వుంటుంది. పట్టుదల కలిగిన సాధకుడు ఆ బిలం దగ్గరకి వెళ్ళి మూడు రాత్రుళ్ళు మోదుగ సమిధలతో అగ్నిని ప్రజ్వరిల్లచేయాలి. తరువాత త్రిమధురాలతో మోదుగ సమిధలతో రెండు వందల సార్లు హోమం చేయాలి. మూడు రోజులు అలాచేస్తేనే ఆ బిలద్వారం తెరుచుకుంటుంది. తెరుచుకున్న ఆ ద్వారంలో నుంచి నృసింహకవచాన్ని పఠిస్తూ సాధకుడు లోపలికి వెళ్ళాలి. లోపలంతా కారు చీకటిగా ఉంటుంది. ధైర్యంగా కొంత ముందుకి వెళితే ఒక విశాలమైన రాజమార్గం కనిపిస్తుంది. అక్కడ నుంచి సాధకుడు సరాసరి పాతాళలోకానికి చేరుకుంటాడు.

పాతాళానికి చేరిన సాధకుడు అక్కడ నృశింహమంత్రాన్ని జపం చేయాలి. అలా చేసిన వెంటనే వీణావాద్యాల్ని మ్రోగిస్తూ ఎంతో మంది సుందరమైన స్త్రీలు సాధకుడికి ఎదురొచ్చి, స్వాగతం పలికి లోపలికి తీసుకువెళతారు. వాళ్ళు అక్కడ ఓ రసాయనాన్ని ఇస్తారు. అది త్రాగితే అమితబలశాలి అవుతారు. అలా రసాయనాన్ని త్రాగి అమితబలశాలి అయిన సాధకుడు భూత ప్రళయకాలం సంభవించే దాకా ఆ సుందర యువతులతో క్రీడించి, చివరికి వాసుదేవుడిలో లీనమౌతాడు.

ఆవుపాలతో, ఆవునేయితో, మోదుగ సమిధలతో నృసింహ మంత్రజపాన్ని హోమాన్ని ఒక నెలరోజుల పాటు మూడు సంధ్యలలో చేయాలి.

అలా చేసిన వాడికి అసాధ్యరోగాలు కూడా నశిస్తాయి. నృసింహుడిని పూజించిన వాడికి సకలకోరికలూ నెరవేరతాయి. ఆయన్ని అష్టోత్తర శతనామాలతో పూజించి పుట్టమట్టి, శ్మశానంలోని మట్టి రాజమార్గంలోవున్న మట్టి, నాలుగురహదారులు కూడలిలో వుండే మట్టి తెచ్చి దాన్ని ఏడేసి ఉండలుగా చేయాలి. ఆ ఉండల్ని ఎర్ర చందనం కలిపిన ఆవుపాలలో మెదిపి, దానితో ఆరు అంగుళాల కొలతతో నృసింహస్వామి ప్రతిమని తయారుచేయాలి. ఒక భూర్జపత్రం మీద గోరోచనంతో స్వామి మంత్రాన్ని రాసి దాన్ని ఆ ప్రతిమ మెడలో కట్టాలి. ఒక మడుగులో నిలిచి నృసింహమంత్రాన్నిఏడురోజులు జపిస్తూ ఆ ప్రతిమని పూజించాలి. అలాచేస్తే ఒక్క ముహూర్త కాలంలో భూమిజల సమృద్ధమవుతుంది. ఎండిన చెట్టు చివర నరసింహమూర్తి ప్రతిమని ఉంచి 108 సార్లు స్వామి మంత్రాన్ని జపిస్తే వర్షం ఆగిపోతుంది.

నరసింహస్వామిని నాలుగు వర్ణాలవారూ ఉపాసించవచ్చు. సర్వాభీష్టాలను ప్రసాదించే స్వామిని పూజించినవాడు పాపాలనుంచి విముక్తుడై ముక్తిని పొందుతాడు. యుద్ధాలలో కష్టాలు సంభవించినప్పుడు, దొంగల బారిన పడ్డప్పుడు, దుర్గమమైన అడవిలో చిక్కుకుపోయినప్పుడు, అగ్నిజ్వాలలు చుట్టుముట్టినప్పుడు, నీటివల్ల ప్రమాదం ఎదురైనప్పుడు రాజువల్ల, ప్రయాణాల వల్ల, గ్రహాల వల్ల కీడు సంభవించినప్పుడు నృసింహస్వామిని భక్తిగా స్మరిస్తే ఆ బాధలన్నీ దూరమైపోతాయి.

## శ్వేతమాధవ మాహాత్మ్యం

పూర్వం కృతయుగంలో ధర్మపరుడు, మహాశూరుడు, సత్యవ్రత పాలనచేసేవాడు అయిన 'శ్వేతుడు' అనే మహారాజుండేవాడు. ఆయన పరిపాలిస్తున్న కాలంలో మానవుల ఆయుర్దాయం పదివేల సంవత్సరాలు. ఒకనాడు ఆయన రాజ్యంలో నివసిస్తున్న 'కపాల గౌతముడు' అనే ఋషి పసితనంలోనే మరణించిన తన కుమారుణ్ణి తీసుకుని శ్వేతుడి దగ్గరకొచ్చాడు.

శ్వేతుడు ఆయన్ని ఓదార్చాడు. అతడి పుత్రుడి అకాల మరణానికి చింతించవద్దు ప్రాణాల్ని తిరిగి తీసుకువస్తానని, అలాగనక చేయలేకపోతే చితి ఎక్కి మరణిస్తానని శపథం చేసాడు.

చేసిన ప్రతిజ్ఞని నిలబెట్టుకోవటం కోసం శ్వేతుడు వందలాది స్తోత్రాలతో మహేశ్వరుణ్ణి స్తుతించాడు. నిత్యం కఠోర నియమాలతో శివమంత్రాన్ని శ్రద్ధగా జపించాడు. శ్వేతుడి భక్తి శివుడి మనసుని కరిగించింది. వెంటనే పార్వతీ దేవితో సహా అతడి ముందు ప్రత్యక్షమై ఏం వరంకావాలో కోరుకోమన్నాడు. శివదర్శనంతో ఎంతో ఆనందించిన శ్వేతుడు ఆయనకి భక్తిగా నమస్కరించి "స్వామీ! మీరు నామీద దయఉంచి అకాల మృత్యువు పొందిన ఆ విప్రుడి కుమారుణ్ణి బ్రతికించండి" అని కోరాడు. శ్వేతుడి పరోపకార బుద్ధికి సంతోషించిన శివుడు అతడి కోరిక ప్రకారం యముణ్ణి శాసించి ఆ బాలుడి ప్రాణాల్ని తిరిగి ప్రసాదించాడు. దానితో ఆ విప్రుడు ఎంతో ఆనందించి రాజుని ఆశీర్వదించి వెళ్ళాడు.

ఆ విధంగా శ్వేత మహారాజు వెయ్యి సంవత్సరాలు తన రాజ్యాన్ని చక్కగా పాలించాడు. ఒక శుభముహూర్తంలో శ్వేతుడు సపరివారంగా దక్షిణసముద్ర తీరానికి వెళ్ళాడు. అక్కడ కృష్ణాష్టమినాడు దివ్యమైన విష్ణు ప్రాసాదాన్ని (ఆలయాన్ని) నిర్మించాడు. అది వందధనుస్సుల వైశాల్యంతో వున్నది. ఆ ఆలయంలో తెల్లటి పాలరాతి శిలతో తయారుచేసిన మాధవుడి విగ్రహాన్ని ప్రతిష్ఠించాడు. ఆ సందర్భంగా బ్రాహ్మణులకి, బీదలకి అనాధలకి విరివిగా దానధర్మాలు చేసాడు.

శ్వేతకేతుడు మాధవాలయాన్ని నిర్మించి ఆ స్వామి సన్నిధిలోనే శ్రీమహావిష్ణువు ద్వాదశాక్షర మహామంత్రాన్ని ప్రణవపూర్వకంగా ఒక మాసంపాటు ఉపాసించాడు. మౌనవ్రతంతో, నిరాహారుడై సమాధి స్థితిలోకి వెళ్ళిపోయాడు. ఆవిధంగా మంత్ర జపాన్ని పూర్తి చేసిన తరువాత మాధవుణ్ణి ఇలా స్తుతించాడు.

## శ్వేతుడు చేసిన మాధవస్తుతి

ఓం నమో వాసుదేవాయ నమః సంకర్షణాయ చ ।
ప్రద్యుమ్నాయా నిరుద్ధాయ నమో నారాయణాయ చ ॥ 1

నమో ౽స్తు బహురూపాయ విశ్వరూపాయ వేధనే ।
నిర్గుణాయా ప్రతర్క్యాయ శుచయే శుభకర్మణే ॥ 2

ఓం నమః పద్మనాభాయ పద్మగర్భోద్భవాయ చ ।
నమో ౽స్తు పద్మవర్ణాయ పద్మ సాస్త్రాయతే నమః ॥ 3

ఓం నమః పుష్కరాక్షాయ సహస్రాక్షాయ మీఢుషే ।
నమః సహస్రపాదాయ సహస్రభుజమన్యవే ॥ 4

ఓం నమో౽స్తు వరాహాయ వరదాయ సుమేధసే ।
వరిష్ఠాయ వరేణ్యాయ శరన్యాయాచ్యుతాయ చ ॥ 5

ఓం నమో బాలరూపాయ బాలపద్మ ప్రభాయ చ ।
బాలార్క సోమనేత్రాయ ముంజకేశాయ ధీమతే ॥ 6

కేశవాయ నమో నిత్యం నమో నారాయణాయ చ ।
మాధవాయ వరిష్ఠాయ గోవిందాయ నమో నమః 7

ఓం నమో విష్ణవే నిత్యం దేవాయ వసురేతసే ।
మధుసూదనాయ నమః శుద్ధాయాంశుధరాయ చ॥ 8

నమో౽నంతాయ సూక్ష్మాయ నమః శ్రీ వత్సధారిణే ।
త్రివిక్రమాయ చ నమో దివ్యపీతాంబరాయ చ ॥ 9

సృష్టికర్త్రే నమస్తుభ్యం గోప్త్రే ధాత్రే నమో నమః ।
నమో౽స్తు గుణభూతాయ నిర్గుణాయ నమో నమః॥ 10

నమో వామనరూపాయ నమో వామనకర్మణే ।
నమో వామననేత్రాయ నమో వామనవాహినే ॥ 11

నమో రమ్యాయ పూజ్యాయ నమో ౽స్త్వవ్య క్తరూపిణే ।
అప్రతర్క్యాయ శుద్ధాయ నమో భయహరాయచ ॥ 12

సంసారార్ణవపోతాయ ప్రశాంతాయ స్వరూపిణే ।
శివాయ సౌమ్యరూపాయ రుద్రాయోత్తరణాయ చ ॥ 13

భవభంగకృతే చైవ భవభోగప్రదాయ చ ।
భవసంఘాతరూపాయ భవసృష్టి కృతే నమః॥ 14

ఓం నమో దివ్యరూపాయ సోమాగ్నిశ్వసితాయ చ ।
సోమసూర్యాంశుకేశాయ గో బ్రాహ్మణహితాయ చ ॥ 15

ఓం నమ ఋక్స్వరూపాయ పదక్రమస్వరూపిణే ।
ఋక్స్తుతాయ నమస్తుభ్యం నమ ఋక్సాధనాయ చ ॥ 16

ఓం నమో యజుషాం ధాత్రే యజూరూపధరాయ చ ।
యజుర్యాజ్యాయ జుష్టాయ యజుషాం పతయే నమః ॥ 17

ఓం నమః శ్రీపతే దేవ శ్రీధరాయ పరాయచ ।
శ్రియః కాంతాయ దాంతాయయోగిచింత్యాయ యోగినే ॥ 18

ఓం నమః సామరూపాయ సామధ్వనివరాయ చ ।
ఓం నమః సామసౌమ్యాయ సామయోగవిదే నమః ॥ 19

సామ్నే చ సామగీతాయ ఓం నమః సామధారిణే ।
సామయజ్ఞవిదే చైవ నమః సామకరాయ చ ॥ 20

నమస్త్వథర్వ శిరసే నమోఽథర్వ స్వరూపిణే ।
నమోఽస్త్వథర్వ పాదాయ నమోఽథర్వకరాయ చ ॥ 21

ఓం నమో వజ్ర శీర్షాయ మధుకైటభఘాతినే ।
మహోదధి జలస్థాయ వేదాహరణకారిణే ॥ 22

నమో దీప్తి స్వరూపాయ హృషీకేశాయ వై నమః ।
నమో భగవతే తుభ్యం వాసుదేవాయతే నమః ॥ 23

నారాయణ నమస్తుభ్యం నమో లోకహితాయ చ ।
ఓం నమో మోహనాశాయ భవభంగకరాయ చ ॥ 24

గతిప్రదాయ చ నమో నమో బంధహరాయ చ ।
త్రైలోక్య తేజసాం కర్త్రే నమస్తే జస్స్వరూపిణే ॥ 25

యోగీశ్వరాయ శుద్ధాయ రామాయోత్తరణాయ చ ।
సుఖాయ సుఖనేత్రాయ నమ స్సుకృతధారిణే ॥ 26

వాసుదేవాయ వంద్యాయ వామదేవాయ వై నమః ।
దేహినాం దేహ కర్త్రేచ భేదభంగకరాయ చ ॥ 27

దేవైర్వందితదేహాయ నమస్తే దివ్య మౌళినే ।
నమో వాసనివాసాయ వాసవ్యవహరాయ చ ॥ 28

ఓం నమో వసుకర్త్రే చ వసువాసప్రదాయ చ ।
నమో యజ్ఞస్వరూపాయ యజ్ఞేశాయ చ యోగినే ॥ 29

యతి యోగకరేశాయ నమో యజ్ఞాంగధారిణే ।
సంకర్షణాయ చ నమః ప్రలంబమథనాయ చ ॥ 30

మేఘఘోష స్వనో త్తీర్ణ వేగలాంగల ధారిణే ।
నమో ఉస్తు జ్ఞానినాంజ్ఞాన నారాయణపరాయణ ॥ 31

*(శ్లో॥34-64, అధ్యా-59)*

ఈ విధంగా శ్వేతుడి చేత కీర్తించబడ్డ శ్రీ మహావిష్ణువు సంతోషించి ఆ పురుషోత్తమ క్షేత్రంలో సకలదేవతలతో సహా శ్వేతుడి ముందు సాక్షాత్కరించాడు. “రాజా! నీ బుద్ధి పరమపవిత్రమైనది. నీ భక్తి ఆదర్శనీయమైనది నీ మీద నాకు అనుగ్రహం కలిగింది. వరం కోరుకో ప్రసాదిస్తాను అన్నాడు. స్వామి మాటలు విని వినయంగా శిరసువంచి” ప్రభూ! నా జీవితం ధన్యమయ్యింది. బ్రహ్మలోకం కన్నా పైన ఉండేది, అత్యంత పవిత్రమైనది అయిన నీ దివ్య ధామాన్ని చేరాలనుకుంటున్నాను. అదే నా కోరిక” అని విన్నవించాడు శ్వేతుడు.

“శ్వేతా! నీకోరిక ధర్మబద్ధం. నీవు అందుకు అర్హుడవే. దేవ, ముని, సిద్ధగణాలకి కూడా అందని ఆ పరమపదానికి నీవు చేరుకోగలవు. నీవు భూలోకంలో సంపూర్ణంగా రాజ్యాన్ని పాలించి చివరికి అన్ని లోకాలనూ దాటి

నా ధామానికి చేరుకోగలవు. నీ కీర్తి ముల్లోకాల్లో వ్యాపిస్తుంది. నీవు ఎప్పుడూ నా సన్నిధిలోనే వుంటావు. నీవు ఆలయం నిర్మించిన ఈ ప్రదేశంలో ఒక గంగ ఏర్పడుతుంది. కాలక్రమంలో అది నీపేర శ్వేత గంగ అని ప్రసిద్ధమవుతుంది. ఎవరైతే ఇక్కడి శ్వేత గంగని కనీసం దర్భతో స్పృశిస్తారో వారు సమాధియోగాన్ని పొంది నా లోకానికి చేరుకోగలరు.

"రాజా! నీవు ప్రతిష్ఠించిన ఈ మాధవ విగ్రహం కూడా నీపేరు మీదుగా ఈనాటి నుంచీ శ్వేత మాధవుడు అని విఖ్యాతి చెందుతుంది. చంద్రుడిలా తెల్లని వెన్నెలలు వెదజల్లే ఈ దివ్యవిగ్రహాన్ని భక్తితో నమస్కరించి అర్చించినవాడు నా వైకుంఠ ధామంలో ఎన్నో మన్వంతరాల పాటు సిద్ధ గంధర్వులతో సేవించబడతాడు. శ్వేత మాధవమూర్తి దర్శనం సకలపాపాలనీ హరిస్తుంది. నీకీర్తి, నీ భక్త అజరామరమౌతుంది" అని పలికి శ్వేతుణ్ణి ఆశీర్వదించి అంతర్ధానమయ్యాడు శ్రీహరి.

## పంచతీర్థ స్నానవిధి

పురుషోత్తమ క్షేత్రంలో మహత్తరమైన పుణ్యఫలాలను మానవులకందించే అయిదు తీర్థాలున్నాయి. వీటినే పంచతీర్థాలంటారు అవి 1. మార్కండేయ హ్రదం 2. శ్రీకృష్ణకల్పవృక్షం (వటవృక్షం) 3. బలరాముడు 4. మహాసముద్రం 5. ఇంద్రద్యుమ్న సరోవరం. జ్యేష్ఠా పూర్ణిమనాడు లేదా జ్యేష్ఠా నక్షత్రం ఉన్న రోజు ఈ అయిదు తీర్థాలనీ సేవిస్తే ఉత్తమ గతులు కలుగుతాయి.

**1. శ్రీకృష్ణ కల్పవృక్షం :** త్రికరణశుద్ధిగా, రాగద్వేషాలని వదిలి శుభ్రంగా స్నానం చేసి కల్పవృక్షంలాంటి వటవృక్షానికి ప్రదక్షిణాలు చేయాలి. తరువాత అక్కడి పురుషోత్తమ ఆలయం చుట్టూ కూడా ప్రదక్షిణాలు చేయాలి. అలా చేస్తే సకల పాపాలనుంచీ విముక్తి లభిస్తుంది. దివ్యమైన ఆ వటవృక్షం 1. వటేశ్వరుడు 2. కృష్ణుడు 3. పురాణ పురుషుడు అనే మూడు పేర్లతో కృతయుగంలో కీర్తించబడింది. కృతయుగంలో ఈ దివ్యవృక్షం ఒక యోజనం ప్రమాణంలో వుండేది. త్రేతాయుగం నీటికి ముప్పావు యోజన పరిమాణంలోకి

వచ్చింది. ద్వాపరయుగంలో అర్ధయోజన విస్తీర్ణంలో వుంది. ఇక కలియుగం వచ్చేసరికి పావుయోజనంలో స్థిరమైంది.

సాక్షాత్తు శ్రీనారాయణుడి స్వరూపమైన కల్పవృక్షానికి నమస్కరించి ఆ వృక్షం క్రిందకూర్చుని ఆచమనం చేసి ఎడమపాదంలో 'ఓం' కారాన్ని కుడిపాదాన 'న'కారాన్ని, ఎడమ తొడమీద 'మో'కారాన్ని, కుడితొడమీద 'నా'కారాన్ని నాభిస్థానంలో 'రా'కారాన్ని, ఎడమ భుజం మీద 'య'కారాన్ని కుడి భుజం మీద 'ణా' కారాన్ని, శిరస్సు మీద 'య' కారాన్ని న్యాసం చేయాలి. తరువాత శ్రీమన్నారాయణ మూర్తిని భక్తిగా ధ్యానించి 'నారాయణ దివ్య కవచాన్ని' పారాయణ చేయాలి. ఆవిధంగా చేసినవాడికి శ్రీమన్నారాయణుడి దివ్యానుగ్రహం కలుగుతుంది.

**2. మార్కండేయ హ్రదస్నానం :** కల్పవృక్ష దర్శనం తరువాత భక్తులు అక్కడే వున్న మార్కండేయ హ్రదంలో స్నానాన్ని చేయాలి. స్నానం చేసేముందు పంచతీర్థ సేవనంలో భాగంగా ఈ మంత్రాన్ని పఠించాలి.

త్వమగ్నిర్ద్విపదాం నాథ రేతోనాథః కామ దీపనః ।
ప్రధానః సర్వభూతానాం జీవానాం ప్రభురవ్యయః ॥

అమృత స్యారణిస్త్వంహి దేవయోని రపాంపతే ।
వృజనం హరమే సర్వం తీర్థరాజ నమోஉస్తుతే ॥

*(శ్లో॥ 44-45, అధ్యా 60)*

ఓ తీర్థ రాజమా! మనుషుల్లో అగ్నివి నీవు. అనగా శరీరం లోపల జఠరాగ్నిగా వుండేది నీవే. కామాన్ని ఉద్దీపింప చేసే వీర్యానివీ నీవే. సర్వభూతాలలో ప్రధాన భూతానివీ నీవే అన్నిజీవులకీ నీవు ప్రభువువి. అమృతంలాంటి వాడివి. దేవతలందరికీ మూలపురుషుడవు. అలాంటి నీవు నా పాపాల్ని హరింపచేయి. నీకు భక్తిగా నమస్కరిస్తున్నాను. అని పలికి ఆతరువాత హ్రదం(సరోవరం)లో దిగి స్నానం చేయాలి. ఒక వేళ స్నానం చేయలేక పోయినా పరవాలేదు పైమంత్రాన్ని చదివి అందులో నీళ్ళని తలమీద

చల్లుకున్నా చాలు. ఫలితం లభిస్తుంది. ఆ దివ్య హ్రదంలో మోకాళ్ళలోతులో నుంచి అఘమర్షణ మంత్రాలను పఠిస్తూ స్నానం చేసిన వాడికి అశ్వమేధయాగ ఫలం లభిస్తుంది.

ఆ హ్రదంలో స్నానంచేసి బైటికి వచ్చాక తడిబట్టల్ని పిండుకుని సూర్యుడికి నమస్కరించి సౌర మంత్రాన్ని 108 సార్లు జపించాలి. తరువాత దేవ, ఋషి, పితృ తర్పణాలని విడవాలి. పితృతర్పణాన్ని ఒంటిచేత్తో నీళ్ళలో వేయకూడదు. ఒడ్డున కూర్చునే చేయాలి. తర్పణాన్ని పాత్రల్లో చేయకూడదు. భూమిమీదే చేయాలి. ఈ విధంగా తర్పణ విధిని నిర్వర్తించి, అష్టాక్షరీ మంత్రపూర్వకంగా శ్రీమన్నారాయణుడిని అర్చించాలి. (అవకాశం లేకపోతే అష్టాక్షరీ మంత్రాన్ని 108సార్లు జపించాలి)

**3.సముద్ర స్నానం :** నారాయణ పూజచేసిన తరువాత మహాసముద్రం దగ్గరకి వచ్చి దానికి భక్తిగా నమస్కరించి ఈ క్రింది శ్లోకాన్ని పఠించాలి.

ప్రాణస్త్వం సర్వభూతానాం యోనిశ్చ సరితాం పతే ।
తీర్థరాజ నమస్తేఽస్తు త్రాహిమామచ్యుత ప్రియ ॥
స్నాత్వైవ సాగరే సమ్యక్తస్మిన్ క్షేతవరే ద్విజాః ।
తీరేచాభ్యర్చ్య విధివన్నారాయణ మనావయమ్ ॥

*(శ్లో॥ 2-3, అధ్యా 62)*

సర్వభూతాలకీ ప్రాణ స్వరూపమైన ఓ సముద్రమా! నీవు అన్ని నదులకీ భర్తవీ తీర్థరాజానివీ. అలాంటి నీకు నమస్కరిస్తున్నాను అని చెప్పి సముద్రంలోకి దిగి స్నానం చేయాలి. ఇక్కడ సాగరుడు తీర్థరాజు. సర్వతీర్థాల ఫలాల్ని ఈయనే ప్రసాదించాడు.

**4.ఇంద్రద్యుమ్న తీర్థం :** సముద్ర స్నానాన్ని ఆచరించాక తీరానికి వచ్చి నారాయణుడికి నమస్కరించి ఆ సమీపంలో వున్న ఇంద్రద్యుమ్న తీర్థానికి చేరుకోవాలి. ఇంద్రద్యుమ్న తీర్థం సాక్షాత్తు యజ్ఞ పురుషుడి శరీరం మీద ఆవిర్భవించిన తీర్థం. ఆ తీర్థంలో స్నానం చేసేముందు ఈ శ్లోకాన్ని పఠించాలి.

అశ్వమేధాంగ సంభూత తీర్థ సర్వామనాశన ।
స్నానంత్వయి కరోమ్యద్య పాపంహర నమోஉస్తుతే ॥

*(శ్లో॥3, అధ్యా-62)*

"ఓ దివ్యతీర్థరాజమా! నీ తీర్థంలో నేను స్నానం చేస్తున్నాను నా పాపాలన్నిటినీ హరించు" అని ప్రార్థించి ఆ తరువాత స్నానం చేయాలి. ఈ దివ్య హ్రదం దగ్గర పితృతర్పణాలు చేస్తే దశాశ్వమేధయాగం చేసిన ఫలితం లభిస్తుంది.

**5.బలరామకృష్ణుల దర్శనం :** ఇంద్రద్యుమ్నతీర్థంలో స్నానం చేసాక బలరామకృష్ణ సుభద్రాదేవి మూర్తులని దర్శించాలి. అదే జ్యేష్ఠ శుద్ధ పూర్ణిమనాడైతే ఎంతో మంచిది. ఆరోజు గనక పురుషోత్తముణ్ణి దర్శిస్తే పునరావృత్తి రహితమైన ముక్తి లభిస్తుంది. జ్యేష్ఠ శుక్ల దశమి నుంచి ఏడు రోజులపాటు పరమపవిత్రమైన రోజులు ఆ రోజుల్లో పురుషోత్తమ క్షేత్రంలో ఏ కొంచెం పుణ్యం చేసినా అది అక్షయ ఫలాన్నిస్తుంది.

జ్యేష్ఠశుక్ల పక్ష దశమికి దశహర అనిపేరు. అనగా పదిరకాల పాపాల్ని నశింపచేస్తుంది అని అర్థం. కనుక ఆనాడు బలరామకృష్ణ సుభద్రల దర్శనం విశేషం. ఈ దివ్య క్షేత్రంలో ఫాల్గుణ పూర్ణిమనాడు కృష్ణుడికి డోలోత్సవం జరుగుతుంది. అలాగే వైశాఖమాస కృష్ణ పక్ష తృతీయా తిథినాడు శ్రీకృష్ణుడికి చందనోత్సవం చేస్తారు. ఈ రెండూ దర్శించినవాడి జీవితం ధన్యం. ఈ పురుషోత్తమ క్షేత్రాన్ని దర్శించటానికి ముఖ్యమైన తిథి జ్యేష్ఠపూర్ణిమ.

## శ్రీకృష్ణ బలరామ సుభద్రల అభిషేకఫలం

పురుషోత్తమ క్షేత్రంలో వెలిసిన బలరామ కృష్ణ సుభద్రలకి అభిషేకం చేస్తే అది అనంతమైన ఫలాలనిస్తుంది. జ్యేష్ఠ మాసంలో పూర్ణిమాతిథినాడు సర్వతీర్థాలూ పురుషోత్తమ క్షేత్రంలో వున్న నూతిలోకి చేరతాయి. అక్కడ ఆనాడు భోగవతీ అనే తీర్థం ప్రత్యక్షమవుతుంది. ఆలయ ప్రాంగణంలో వున్న ఆకూపం నుంచి బంగారు కలశంలో నీళ్ళని తీసుకువచ్చి ఆలయంలో వున్న ముగ్గురు మూర్తులకీ అభిషేకం చేయాలి. అభిషేకం చేసేటప్పుడు -

నమస్తేదేవదేవేశ పురాణపురుషోత్తమ ।
సర్గస్థిత్యంతకృ ద్దేవ లోకనాథ జగత్పతే ॥
త్రైలోక్యధారణందేవం బ్రహ్మణ్యం మోక్షకారిణమ్ ।
తం నమస్యామహేభక్త్యా సర్వకామఫలప్రదమ్ ॥

*(శ్లో॥21-22, అధ్యా-65)*

అనే శ్లోకాన్ని పఠించి వివిధరకాల పుణ్యజలాలతో సుగంధద్రవ్యాలతో శాస్త్రోక్తంగా అభిషేకం చేయాలి. ఆ మహాపర్వదినం నాడు జరిగే అభిషేకాన్ని దర్శించటానికి సకలలోకాలలో వున్న దేవతలంతా వివిధ రకాల ద్రవ్యాల్ని తీసుకుని తరలివస్తారు. వారంతా అదృశ్యంగా అభిషేక సేవలో పాల్గొంటారు. అభిషేకం పూర్తయిన తరువాత ఋషులు, మునులు, సకల దేవతలు శ్రీకృష్ణున్ని మధురంగా ఇలా స్తుతిస్తారు.

## శ్రీ కృష్ణస్తుతి

జయజయలోకపాల భక్త రక్షక జయ జయ ।
ప్రణతవత్సల జయ జయ భూత చరణ జయజయ ॥

ఆది దేవ బహుకారణ జయజయ వాసుదేవ ।
జయజయ సుర సంహరణ జయజయ దివ్య మీన ॥

జయ జయ త్రిదశవర జయజయ జలధిశయన ।
జయజయ యోగివర జయజయ సూర్యనేత్ర జయజయ దేవరాజ ॥

జయజయ కైటభారే జయజయ వేదవర ।
జయజయ కూర్మరూప జయజయ యజ్ఞవర ॥

జయజయ కమలనాభ జయజయ శైలచర ।
జయజయ యోగశాయిన్ జయజయ వేగ ధర ॥

జయజయ విశ్వమూర్తే జయజయ చక్రధర ।
జయజయ భూతనాథ జయజయ ధరణీధర ॥

జయజయ శేషశాయిన్ జయజయ పీతవాసో ।
జయజయ సోమకాంత జయజయ యోగివాస ॥

జయజయ దహనవక్త్ర జయజయ ధర్మవాస ।
జయజయ గుణనిధాన జయజయ శ్రీనివాస ॥

జయజయ గరుడగమన జయజయ సుఖనివాస ।
జయజయ ధర్మకేతో జయజయ మహీనివాస ॥

జయజయ గహనచరిత్ర జయజయ యోగిగమ్య ।
జయజయ మఖనివాస జయజయ వేదవేద్య ॥

జయజయ శాంతికర జయజయ యోగిచింత్య ।
జయజయ పుష్టికర జయజయ జ్ఞానమూర్తే ॥

జయజయ కమలాకర జయజయ భావవేద్య ।
జయజయ ముక్తికర జయజయ విమలదేహ ॥

జయజయ సత్త్వనిలయ జయజయ గుణసమృద్ధ ।
జయజయ యజ్ఞకర జయజయ గుణవిహీన ॥

జయజయ మోక్షకర జయజయ భూశరణ్య ।
జయజయ కాంతియుత జయజయ లోకశరణ ॥

జయజయ లక్ష్మీయుత జయజయ పంకజాక్షి ।
జయజయ సృష్టికర జయజయ యోగయుత ॥

జయజయాతసీకుసుమ జయజయ సముద్ర శ్యామదేహ ।
జయజయ విష్టదేహ జయజయ లక్ష్మిపంకజషట్చరణ ॥

జయజయ భక్తవశ జయజయ కలుషహర ।
జయజయ లోకకాంత జయజయ పరమశాంత ॥

జయజయ పరమసార జయజయ చక్రధర ।
జయజయ భోగియుత జయజయ నీలాంబర ॥

జయజయ శాంతికర జయజయ మోక్షకర ।
జయ కృష్ణ జగన్నాథ జయ సంకర్షణానుజ ॥

జయ పద్మపలాశాక్ష జయ వాంఛా ఫలప్రద ।
జయ మాలావృతోరస్క జయ చక్రగదాధర ।
జయ పద్మాలయాకాంత జయ విష్ణో నమోఽస్తుతే ॥ *(శ్లో॥49, అధ్యా-65)*

## గుడివాయాత్రవిధి - ఫలం

పురుషోత్తమక్షేత్రంలో జగన్నాథుడికి చేసే ఉత్సవాలలో ప్రముఖమైనది గుడివాయాత్ర. పూర్వం ఇంద్రద్యుమ్నుడు స్వామిని వేడుకోగా ఆయన ఇంద్రద్యుమ్నహ్రదం దగ్గరకి ప్రతి సంవత్సరం వచ్చి ఏడు రోజులు ఉంటానని మాటిచ్చాడు. దాన్ని అనుసరించి ఆలయంలో వున్న బలరామకృష్ణ సుభద్రాదేవి మూర్తులని ఒక రథం మీదకి వేంచేపుచేసి అంగరంగవైభవంగా ఇంద్రద్యుమ్న సరోవర ప్రాంతంలోవున్న గుడివామండపానికి తీసుకువెళతారు. స్వామివారి మూర్తులు అక్కడే ఏడురోజులు పూజలందుకుంటాయి. గుడివాయాత్రలో భాగంగా రథంమీద కొలువైన జగన్నాథుణ్ణి దర్శిస్తే అనంతమైన పుణ్యం లభిస్తుంది. విష్ణులోక ప్రాప్తి కలుగుతుంది.

## పురుషోత్తమ పూజావిధి

జ్యేష్ఠశుక్ల ఏకాదశినాడు పురుషోత్తమ క్షేత్రంలోవున్న ఇంద్రద్యుమ్న సరస్సులో యథావిధిగా స్నానంచేయాలి. తరువాత దేవఋషి, పితృతర్పణాలు ఆచరించి మడి వస్త్రాల్ని ధరించి తూర్పు దిశకి తిరిగి వేదమాత గాయత్రీ మంత్రాన్ని 108 సార్లు పఠించాలి. తరువాత యథాశక్తి సూర్యనమస్కారాలు చేయాలి. స్త్రీలు, శూద్రులు పురోక్త విధానాన్ని ఆచరించాలి.

ఆ తరువాత స్వగృహంలోకానీ ఒక పవిత్రమైన ప్రదేశంలోకానీ మౌనంగా పురుషోత్తముడి ప్రతిమని స్థాపించి, ధ్యానావాహనాది షోడశోపచారాల విధానంతో పూజించాలి. ముందుగా స్వామిని ఆవునెయ్యితో, పాలతో అభిషేకించాలి. పంచామృతాలు, చందనోదకాలతో స్నానం చేయించాలి. తరువాత నూతన వస్త్రాలని ఆభరణాలని సమర్పించాలి. చందనం,అగరు, కర్పూరం, కుంకుమ స్వామికి సమర్పించి జగన్నాథుడకి ప్రీతికరమైన తామర, మల్లి పుష్పాలతో పూజించాలి. సుగంధధూపాన్ని వేసి, ఆవునెయ్యితో గానీ నువ్వులనూనెతో గానీ 12 దీపాలు వెలిగించాలి. పాయసం, చక్కిలాలు, లడ్డు, బెల్లం పానకం, ఫలాలు స్వామికి నివేదించాలి. పంచోపచార పూజ చేసిన తరువాత 108 సార్లు "నమః పురుషోత్తమాయ"అనే మంత్రాన్ని జపించాలి.

ఈ విధంగా స్వామిని పూజించిన తరువాత గంధవస్త్రాలతో గురువుని లేదా పురోహితుణ్ణి పూజించి దక్షిణతాంబూలాలతో సత్కరించాలి. వేదపఠనం చేసి ఆ రాత్రి జాగరణ చేయాలి. జాగరణలో భాగంగా వాసుదేవ సంకీర్తన చేయాలి. చేయించాలి. ఆ విధంగా శ్రీహరి దివ్యనామ సంకీర్తన చేస్తూ రాత్రంతా గడపాలి. మర్నాడు ఉదయం ద్వాదశినాడు 12 మంది వేద ఇతిహాస పురాణాలలో పరిజ్ఞానం వున్న పండితుల్ని ఆహ్వానించి, వారికి యథాశక్తిగా హిరణ్యాది దానాలు చేసి వారిని పూజించాలి. వీటితో పాటు నీటితో నింపిన 12 కుండల్ని, మధురమైన మోదకాలనీ (లడ్లు) కూడా సమర్పించాలి. తరువాత అతిథులందరికీ విందు భోజనాన్ని పెట్టి సంతృప్తి పరచాలి. తరువాత –

సర్వవ్యాపీ జగన్నాథః శంఖచక్రగదాధరః ।
అనాది నిధనో దేవః ప్రీయతాం పురుషోత్తమ ॥

"సర్వత్రా నిండివున్నవాడు, ఆదిమధ్యాంతరహితుడు శంఖచక్ర గదాధరుడు జగన్నాథుడు అయిన పురుషోత్తముడు ప్రీతి చెందుగాక!" అని చెప్పి విప్రులకి నమస్కరించి వారి ఆశీర్వచనాన్ని తీసుకోవాలి.

ఈ విధంగా జ్యేష్ఠ శుక్ల ఏకాదశి ద్వాదశి తిథుల్లో పురుషోత్తముడిని పూజిస్తే అశ్వమేధ రాజసూయ యాగాలు చేసినంత పుణ్యఫలాన్ని పొందుతారు. తనతోపాటు తన పూర్వీకులందరినీ తరింపచేస్తారు. ఈ పుణ్యఫలంగా ఇహలోకంలోనే కాక పరలోకంలో కూడా అనంతమైన సుఖభోగాలు అనుభవిస్తారు.

## శ్రీమహావిష్ణు లోకవైభవం

అన్నిలోకాల కన్నా శ్రీమన్నారాయణుడు కొలువుండే విష్ణులోకం చాలా గొప్పది. అది సంసార దుఃఖాల్ని నశింపచేస్తుంది. అక్కడుండేవన్నీ ఆశ్చర్యాన్నీ కలిగిస్తాయి. అశోకాది మహావృక్షాలన్నిటికీ అది నివాసస్థానం. కల్పవృక్షం కూడా అక్కడే వుంటుంది. అన్ని ఋతువుల్లో లభించే ఫలవృక్షాలు, పూలవృక్షాలు అక్కడ అసంఖ్యాకంగా వుంటాయి. అందమైన పద్మాలు, కలువలు, హంసలతో

నిండిన సుందర సరోవరాలు, వివిధరకాల జలపక్షులు విహరించే సరస్సులో ఎన్నో వున్నాయి. స్వేచ్ఛగా కోరినచోటుకి తీసుకువెళ్ళే బంగారు విమానాలలో అక్కడి దేవతలు విహరిస్తు వుంటారు. అవి వాయువేగంకన్నా మించిన వేగంతో వెళుతుంటారు. ఎంతో అందమైన దేవతాస్త్రీలు పుణ్యం చేసి అక్కడికి వచ్చిన వారికి స్వాగత సత్కారాలు చేస్తుంటారు.

భూలోకంలో దక్షిణ సముద్ర తీరంలో పెద్ద మర్రిచెట్టు దగ్గర వున్న శ్రీకృష్ణుడు వైకుంఠంలో అప్సరసలతో దర్శనమిస్తాడు. 1.పుణ్యఫలంతో కృష్ణ సారూప్యం పొందిన భక్తులు తమ వైకుంఠధామానికి వస్తూవుంటారు.

ఆ సుందర వైకుంఠధామంలో మేలిమిబంగారు రజనుతో మెరిసేరంగు కల్గి, అనేక రత్నాలతో అలంకరించబడి, ఒక యోజనం విస్తీర్ణంలో బంగారు ప్రాకారంతో శ్రీహరి మందిరం వుంది. చుక్కల మధ్యవున్న చంద్రుడులాగా శ్రీహరి వైకుంఠ ధామంలో శ్రీహరి మందిరం భాసిస్తూ వుంది. కవచాల్ని ధరించిన ద్వారపాలకులు ఆ మందిరానికున్న నాలుగు ద్వారాలనీ సంరక్షిస్తూ వుంటారు. ఆ దివ్య వైకుంఠంలో స్వర్ణ, మరకత, ఇంద్రనీల, మహానీల, పద్మరాగ, వజ్ర వైఢూర్య మయమైన ఏడు ప్రాకారాలున్నాయి.

వైకుంఠధామంలో వున్న స్తంభాలన్నీ రత్నాలతో పగడాలతో అలంకరించబడ్డాయి. అక్కడ మహా సిద్ధులు తమ దివ్య తేజస్సుతో దిక్కులన్నిటినీ ప్రకాశింపచేస్తూ వుంటారు. ఆ దివ్యమందిరంలో నీలమేఘశ్యాముడు, పీతాంబరధారి, శ్రీవత్సాన్ని ధరించినవాడు అయిన శ్రీమన్నారాయణుడు శ్రీమహాలక్ష్మితో కలిసి ప్రకాశిస్తూ వుంటాడు. ఆయన కుడిచేతిలో సుదర్శన చక్రం, ఎడమచేతిలో తెల్లని శంఖం విరాజిల్లుతూ వుంటుంది. ఆ దివ్య శంఖం పేరు పాంచజన్యం. దానికి వేయి సుడులుంటాయి. ఆ శంఖనాదం వింటేచాలు శత్రువులందరూ క్షోభిస్తారు. స్వామి కుడిచేతిలో సకల దానవుల్ని నశింపచేసేది, జ్వలించే అగ్నిలా ప్రకాశించేది, సకల పాపాల్నీ నాశనం చేసేది అయిన కౌమోదకీ అనే గద విరాజిల్లుతూ వుంటుంది. ఎడమచేతిలో సూర్యతేజస్సుతో వెలిగే శార్ఙ్గం అనే ధనస్సు, అగ్ని జ్వాలల్ని చిమ్మే బాణాలతో సహా వెలుగొందుతూ వుంటుంది.

శ్రీమన్నారాయణుడు సకలలోక సృష్టి స్థితి లయకారకుడు. సకల శాస్త్ర నిపుణుడు, జగద్గురువు. సహస్రశీర్షుడు, వేయిపాదాలు కలిగినవాడు, దివ్యసింహాసనం మీద స్వామి ఆసీనుడై వుంటాడు. ఆయన కళ్ళు తామర పూలరేకులలా విశాలంగా వుంటాయి. ఆయన శరీరం మెరుపుతీగలా మెరుస్తూ వుంటుంది. స్వామి నిత్యం సిద్ధగణాలు, మునులు, దేవతా బృందాలు చేసే మధురమైన స్తుతుల్ని ఆలకిస్తూ వుంటాడు. ఆ వైకుంఠంలో కీర్తి నుంచి మాయవరకూ వున్న ఆయా శక్తుల అధిష్ఠానదేవతలు కొలువుదీరివుంటారు. ఘృతాచి నుంచి నవగర్భ వరకూ వున్న ఎందరో అప్సరస్త్రీలు నిత్యం ఆడుతూ పాడుతూ నారాయణుడిని సేవిస్తూ వుంటారు.

వైకుంఠధామంలో నివసించేవారికి రోగాలు, నీరసం, మృత్యువు, ఎండ,చలి, ఆకలి, దప్పిక, దుఃఖం వంటివి ఏవీ కలగవు. ఆ విష్ణులోకం అందరికీ ఆనందాన్ని కలిగిస్తుంది. అన్ని కోరికలనీ తీరుస్తుంది. వివిధరకాల పుణ్యాలు చేసేవారు పొందే ఇతరలోకాలేవీ ఈ విష్ణులోకం పదహారో కళకి కూడా సరితూగవు. ఇటువంటి దివ్యథామానికి నాస్తికులు, విషయలంపటం వున్నవారు, కృతఘ్నులు, లోభులు, దొంగలు, ఇంద్రియనిగ్రహం లేనివారు చేరలేరు. ఈ దివ్యలోకాన్ని దక్షిణ సముద్రతీరంలో వున్న పురుషోత్తమ క్షేత్రాన్ని చేరి అక్కడ బలరామకృష్ణ సుభద్రల్ని దర్శించి సేవించినవారు మాత్రమే చేరగలరు. అలాగే పురుషోత్తమ క్షేత్రంలో వున్న కల్ప (వట)వృక్షం లేదా సముద్రతీరంలో మరణించిన వారు కూడా ఈ దివ్య పదాన్ని చేరుకోగలరు.

## అనంత వాసుదేవ వైభవం

పూర్వం బ్రహ్మదేవుడు దేవశిల్పి అయిన విశ్వకర్మని పిలిచి అతడితో ఉత్తమమైన శిలని సేకరించి దానితో వాసుదేవుడి ప్రతిమని తయారుచేయమని చెప్పాడు. ఆ ప్రతిమని దర్శించి ఇంద్రాది దేవతలు, మనుష్యాది భూలోకవాసులు, దానవుల వల్ల, రాక్షసుల వల్ల ఎలాంటి భయాన్ని పొందకుండా వుంటారని తెలిపాడు.

బ్రహ్మదేవుడి ఆదేశానుసారం విశ్వకర్మ ఒక దివ్యమైన శిలను సేకరించి, శంఖ, చక్ర, గదా, శ్రీవత్సాలని, వనమాలని ధరించి, తెల్లని తామర పూలలాంటి నేత్రాలతో, కిరీటాన్ని భుజకీర్తుల్ని ధరించి, పట్టుపీతాంబరాన్ని కట్టుకుని దివ్యాలంకార శోభితంగా ప్రకాశిస్తున్న వాసుదేవమూర్తిని తయారు చేసాడు. సర్వాంగ సుందరంగా వున్న వాసుదేవప్రతిమని ఒక శుభముహూర్తంలో బ్రహ్మదేవుడు స్వయంగా ప్రతిష్ఠించాడు. ఆ ప్రతిష్ఠా సమయానికి దేవరాజు ఇంద్రుడు ఇతర దేవతలతో సహా విచ్చేసి స్వామిని అర్చించి తిరిగి తన నగరానికి వెళ్ళాడు. ఆనాటి నుంచి నిత్యం వాసుదేవుణ్ణి అర్చిస్తూ వృత్రుడు, సుముచి వంటి ఘోర రాక్షసుల్ని అవలీలగా సంహరించగలిగాడు దేవేంద్రుడు.

భూలోకంలో రెండో త్రేతాయుగం ఆరంభమయ్యింది. మహావీరుడైన రావణుడు భూలోకంలో జన్మించాడు. పదివేల సంవత్సరాలు నిరాహారంగా, ఇంద్రియాల్ని అదుపులో వుంచుకుని అసాధ్యమైన దివ్య తపస్సు చేసాడు. అతడి తపస్సుకి మెచ్చుకున్న బ్రహ్మ ప్రత్యక్షమై దేవతలచేత, దానవులచేత, నాగులచే మరణం సంభవించకుండా వుండుగాక! అనే వరాన్ని ప్రసాదించాడు. ఆ వరబలంతో రావణుడు ఎవరికీ అందనంత ఉన్నత స్థానానికి చేరుకున్నాడు. రావణుడి కుమారుడు మేఘనాథుడు తన అసమాన పరాక్రమంతో దేవేంద్రుణ్ణి జయించి, ఆనాటి నుంచి ఇంద్రజిత్తు అని ప్రసిద్ధిచెందాడు. కొన్నాళ్ళకి రావణుడు తిరిగి అమరావతి మీదకి దండెత్తాడు. ఇంద్రనగరాన్ని జయించి అక్కడ ఇంద్రుడి గృహంలో వున్న వాసుదేవమూర్తిని చూసాడు. అది అతన్ని ఆకర్షించింది. వెంటనే ఆ దివ్య విగ్రహాన్ని విమానం మీద లంకారాజ్యానికి చేర్పించాడు.

లంకకు చేరిన వాసుదేవ మూర్తిని రావణుడు మంత్రి సోదరుడు అయిన విభీషణుడు చూసాడు. ఆయన వళ్ళు పులకరించింది. సహజంగానే విభీషణుడు శ్రీహరి భక్తుడు. తను నిత్యం పూజించే స్వామి సాక్షాత్తు తన ముందుకే రావటంతో “నాజన్మధన్యమైంది, నేటికి నా తపస్సు ఫలించింది”

అని భావించాడు. వెంటనే రావణుడి దగ్గరకి వెళ్ళి అన్నా! నాకీ విగ్రహాన్ని ప్రసాదించు. దీన్ని నేను పూజించుకుంటాను. అని కోరాడు. సోదరా! ఈ విగ్రహంతో నాకేంపని, ఏదో చూడముచ్చటగా వుందని తెచ్చాను. నీకు కావాలంటే తీసుకెళ్ళు అని ఇచ్చి పంపాడు.

విభీషణుడు వాసుదేవ ప్రతిమని గ్రహించి 108 సంవత్సరాలు దీక్షగా పూజించాడు. ఆ పూజా ప్రభావంతో జరామరణాలు లేని స్థితిని, అణిమాది అష్టసిద్ధుల్నీ పొందాడు.

ఇక రావణుడు బ్రహ్మ వరబలంతో సకలలోకాలనీ జయించాడు. సిద్ధుల్ని తపస్వుల్ని అవమానాల పాలుచేసాడు. సీతాస్వయంవరానికి వచ్చి భంగపాటుపడ్డాడు. తరువాత ఆమె మీద వ్యామోహాన్ని పెంచుకుని మారీచుడి సాయంతో సీతను అపహరించి లంకకు తెచ్చాడు. దానితో రాముడు లంకమీదకి వానరసైన్యంతో దండెత్తి రావణుని సోదరుడైన కుంభకర్ణుడిని, కుమారుడైన ఇంద్రజిత్తునీ వధించి చివరికి రావణాసురుణ్ణి సంహరించి విభీషణుడికి లంకారాజ్యాన్ని అప్పగించాడు. అప్పుడు విభీషణుడి చేత పూజలందుకుంటున్న వాసుదేవ ప్రతిమని, సీతాదేవిని తీసుకుని పుష్పక విమానం ద్వారా అయోధ్యానగరానికి చేరుకున్నాడు. ఆ విధంగా వాసుదేవ ప్రతిమ అయోధ్యా నగరానికి చేరింది. ఆ దివ్య విగ్రహాన్ని ఆరాధించిన రాముడు. 11వేల సంవత్సరాలు అయోధ్యనుపాలించి చివరికి ఆ మూర్తిని సముద్రుడికి అప్పగించాడు. ఆనాటినుంచీ ఆ వాసుదేవ ప్రతిమని సముద్రుడు తన గర్భంలో వుంచుకుని సంరక్షిస్తున్నాడు.

త్రేతాయుగం పరిసమాప్తమయ్యింది. ద్వాపరయుగం ప్రారంభమైంది. ఈ యుగంలో జగన్నాథుడు భూదేవి భారాన్ని తగ్గించటం కోసం వసుదేవుడికి కుమారుడు శ్రీకృష్ణుడుగా భూలోకంలో అవతరించాడు. అదే కాలంలో లోక హితం కోసం పురుషోత్తమ క్షేత్రంలో సముద్రుడు తనలో దాచివుంచిన వాసుదేవ ప్రతిమని బైటికి తెచ్చాడు. ఆనాటినుంచి పురుషోత్తమక్షేత్రంలో వాసుదేవ ప్రతిమ

స్థిరంగా నిలిచివుంది. త్రికరణశుద్ధిగా భక్తి ప్రపత్తులతో ఇక్కడి వాసుదేవుణ్ణి కొలిచిన వారికి సకల శుభాలూ జరుగుతాయి. ఈ వాసుదేవమూర్తినే ఇక్కడ 'అనంతవాసుదేవుడు' అంటారు.

## కండుమహర్షి ఉపాఖ్యానం

సకల పురుషార్థాలనీ ప్రసాదించే ఆ పురుషోత్తమ క్షేత్రంలో పరమ ధర్మాత్ముడు, తపస్సంపన్నుడు, సత్యవాది, దయామయుడు అయిన 'కండు' అనే మహర్షి ఉన్నాడు. ఆ మహర్షి పురుషోత్తముణ్ణి ఆరాధించి సకల సిద్ధులు పొందాడు. అసలు కండుమహర్షి ఎవరంటే!

పవిత్రమైన గోమతీతీరంలో కందమూలఫలాలు, దర్భలు సమృద్ధిగా లభించే పుణ్యాశ్రమం అనే గ్రామం వుంది. అక్కడే పూర్వం కండుముని నివసించేవాడు. ఆయన యమనియమాలతో మౌనంగా తపస్సు చేసుకునేవాడు. ఎండాకాలంలో పంచాగ్నుల మధ్యలో నిలబడి, వర్షాకాలంలో తడుస్తూ, సీతాకాలంలో తడిబట్టలు కట్టుకుని మహాకఠోరంగా తపస్సు కొనసాగించాడు. ఆయన తపస్సు వేడికి ముల్లోకాలూ తల్లడిల్లిపోయాయి. ఇది గమనించిన ఇంద్రుడు ఎలాగైనా ఆయన తపస్సు భంగం చేయాలని భావించి ప్రమ్లోచ అనే అప్సరసని పిలిచాడు. భామినీ! నీవు వెంటనే భూలోకానికి వెళ్ళి అక్కడ తపస్సు చేస్తున్న కండుముని దీక్షని భగ్నంచేయి అని ఆజ్ఞాపించాడు. ఇంద్రుడి మాటవిన్న ఆ అప్సరస "ప్రభూ! మీ ఆజ్ఞని శిరసా వహిస్తాను కానీ నాకు నా జీవితం నిలుస్తుందా అన్న అనుమానం కలుగుతోంది. ఆ కండుముని మహాతపస్సంపన్నుడు. నా చర్యలకి ఆయనకి కోపం వస్తే ఘోరంగా నన్ను శపించగలడు. అందుకే భయపడుతున్నాను. ఇలాంటి వారి విషయాలలో ఊర్వశీ రంభా మేనక లాంటి అనుభవం ఉన్న వారున్నారు కదా! దయచేసి వారిని వినియోగించండి" అని ప్రార్థించింది.

భామినీ! దేవలోకంలో ఎందరో అప్సరసలున్నారు నిజమే! అయితే ఈ పని చేయటానికి నీవే సమర్థురాలివి. నీవేం భయపడకు. నీకు తోడుగా

మన్మథుడిని, వసంతుడిని, మలయువాయువుని ఇచ్చి పంపిస్తాను. సంకోచించకుండా బయలుదేరు అని చెప్పి, వారందరినీ తోడిచ్చి పంపాడు ఇంద్రుడు. ప్రమ్లోచ కండుముని ఆశ్రమానికి వెళ్ళింది. ఆశ్రమం దాని చుట్టుపక్కల పరిసరాలు ఎంతో రమణీయంగా వున్నాయి. చక్కటి సెలయేర్లు ప్రవహిస్తున్నాయి. పక్షుల కిలకిలరావాలతో ఆ పరిసరాలన్నీ ఆనందంగా కనిపిస్తున్నాయి. ప్రమ్లోచ తనవెంట వచ్చిన మన్మథ, వసంత, మలయ మారుతాలతో "మీరందరూ నాకు అనుకూలమైన వాతావరణాన్ని సృష్టించండి" అని చెప్పింది.

ప్రమ్లోచ కండుముని ఆశ్రమంలో ఒకచోట చేరి మధురంగా గానం చేయసాగింది. మన్మథుడు, వసంతుడు తమ ప్రభావాన్ని చూపటం ప్రారంభించారు. మలయమారుతుడు సుగంధ భరితంగా కామాన్ని ఉద్దీపింపచేసే విధంగా వీయసాగాడు. ప్రమ్లోచ మధుర గానానికి కండుముని మనస్సు చలించింది. నెమ్మదిగా కళ్ళుతెరిచాడు. ఆమెగానం ఆయన మనసుని స్పందింపచేసింది. వెంటనే లేచి ఆ గానం వినిపించిన దిశగా బయలుదేరాడు. అక్కడ దివ్యసౌందర్యంతో మెరిసిపోతున్న ప్రమ్లోచ ఆయనకి కనిపించింది. ఆమె అందానికి ఆశ్చర్యపోయాడు కండుముని. ఆమెతో " సుందరీ ఎవరు నీవు? నీగానం నా మనసుని దోచింది. నీ పేరేమిటి చెప్పు? అని ప్రశ్నించాడు. స్వామీ! నేనొక అనాథను తమరికి సేవ చేయాలని వచ్చాను. తమరి ఆశ్రమంలో కాస్త చోటు కల్పిస్తే మీ ఆజ్ఞల్ని శిరసా వహిస్తాను. మీ పాదదాసిగా వుంటాను అన్నది ప్రమ్లోచ. ఆమె విన్నపాన్ని మన్నించాడు కండుముని. ఆమెని తన ఆశ్రమంలోకి తీసుకువచ్చాడు. ఇలా తమ పని సులువుగా నెరవేరటంతో ఆనందించిన మన్మథుడు, వసంతుడు మలయానిలుడు దేవలోకానికి వెళ్ళి ఆ విషయాన్ని దేవేంద్రుడికి విన్నవించారు.

ప్రమ్లోచతో ఆశ్రమంలోకి ప్రవేశించిన కండుముని వెంటనే తన తపోశక్తితో నవయవ్వన పురుషుడిగా మారిపోయాడు. దివ్య సుందర రూపంతో ప్రకాశిస్తున్న కండుముని నూతన రూపం చూసి ప్రమ్లోచ ఆశ్చర్యపోయింది.

ఇక ఆనాటి నుంచి కండుముని జపం, తపం, హోమం, అన్ని విడిచి పెట్టి, రాత్రి పగలనక ప్రమ్లోచతో సకల సుఖభోగాలు అనుభవిస్తున్నాడు. అలా వంద సంవత్సరాలు గడిచిపోయాయి. ఒకనాడు ప్రమ్లోచ. స్వామీ మాది దేవలోకం. నేను అక్కడికి వెళ్ళాలి. దయచేసి అనుమతి ఇవ్వండి అని అడిగింది. ఆమె వ్యామోహంలో చిక్కుకున్న కండుముని దేవీ! మరికొన్ని రోజులు నాకోసం ఉండరాదా అని వేడుకున్నాడు. సరేనంది ప్రమ్లోచ. తిరిగి అలా మరో వంద సంవత్సరాలు గడిచిపోయాయి. స్వామీ ఇకనైనా నేను వెళ్ళడానికి అనుమతించండి అని కోరింది. లేదులేదు ఇంకొన్ని రోజులు వుండు అని వేడుకున్నాడు కండుముని. చేసేదేమి లేక తిరిగి సరేనంది ప్రమ్లోచ. అలా వాళ్ళిద్దరూ ఎన్నో సంవత్సరాలు సంభోగ సుఖాలలో మునిగిపోయారు.

ఒకనాడు కండుముని ఉదయాన్నే లేచి కుటీరం నుంచి బయటకి బయల్దేరాడు. ఆయన్ని చూసి స్వామీ ఎక్కడికి వెళుతున్నారు అని అడిగింది ప్రమ్లోచ. దేవీ! తెల్లవారింది సంధ్యవార్చాలి కదా! అందుకే వెళుతున్నానన్నాడు. ఆ మాటలు విని ప్రమ్లోచ ఒక్కసారి పక్కున నవ్వి ధర్మజ్ఞా! తమరి అనుష్ఠానం ఏనాడో గతించింది. ఇప్పుడేమిటి కొత్తగా సంధ్యావిధి అంటారు” అని పలికింది. ఆమె మాటలు విని ఆశ్చర్యపోయాడు కండుముని. ఏమిటి నువ్వంటున్నది. నిన్ననే కదా నువ్వు నాకు కనిపించింది. ఎందుకు పరాచికాలాడతావు, నిజంచెప్పు అని అడిగాడు.

“స్వామీ! నామాటలు నిజమే. మీరు నేను కలిసి సుఖభోగాలు అనుభవించి కొన్ని వందల సంవత్సరాలు గడిచిపోయాయి. సరిగ్గా చెప్పాలంటే తొమ్మిదివందల సంవత్సరాలు ఆరు మాసాల మూడు రోజులైంది నేటికి” అని చెప్పింది ప్రమ్లోచ. అది వినగానే కండుమునికి జ్ఞానోదయమైంది. తనెంత పొరపాటు చేసాడో అర్థమయ్యింది. అయ్యో! నేనెంత మోహంలో పడిపోయాను. ఎంత ఘోరమైన అపచారాన్ని చేసాను. ఇన్నాళ్ళు నేను చేసిన తపస్సంతా వ్యర్థమైపోయింది కదా! నా వివేకం ఏమైపోయింది. కామప్రభావానికి నేనెలా

లొంగిపోయాను? నేను చేసిన పుణ్యకర్మలన్నీ తుచ్ఛమైన కామం బారినపడి సర్వనాశనమైపోయాయే. ఇక ఇప్పుడేం చేయాలి? నా గతి ఏమిటి?" అని చింతించి ఎదురుగా వున్న ప్రమ్లోచతో ..

"ఛీ పాపాత్మురాలా! నీ వల్లనే నాకీ దుర్గతి పట్టింది. తుచ్ఛుడైన ఆ ఇంద్రుడు పంపగా వచ్చి నా తపస్సుని భంగంచేసి నన్ను సర్వభ్రష్టుణ్ణి చేసావు. తప్పో ఒప్పో ఇన్నాళ్ళు నాతో ఉన్నావు కాబట్టి నిన్ను భస్మం చేయను. అయినా ఇందులో నీ తప్పేముంది. నీ ప్రభువు చెప్పిన పని నీవు చేసావు అంతే! నేనే ఇంద్రియనిగ్రహాన్ని కోల్పోయి నీ వలలో చిక్కుకున్నాను. తప్పంతా నాదే. ఇక నీవిక్కడ ఉండతగవు. నీలోకానికి తిరిగి వెళ్ళిపో" అని గద్దించాడు కండుముని.

తపోధనుడైన ఆయన మాటలు వినగానే వళ్ళంతా జలదరించి చెమటలు పట్టాయి ప్రమ్లోచకి. మరేమీ మాట్లాడకుండా అక్కడ నుంచి బయలుదేరింది. ఆ ఆశ్రమం దాటి వనంలోకి వచ్చింది. తన వంటికి పట్టిన చెమటని అక్కడున్న చెట్ల చిగుర్లతో తుడుచుకుంది.

ప్రమ్లోచ తన చెమటని చిగురుటాకులకి తుడవగానే ఆమె శరీరం ఒక్కసారిగా పులకరించింది. ఆ చెమట బిందువులు గర్భాన్ని ధరించాయి. ఇది తెలియని ఆమె ఆకాశమర్గాన తన లోకానికి వెళ్ళిపోయింది. ఆ వనంలోని వృక్షాలు చెమట బిందువులో వున్న గర్భాన్ని సంరక్షించాయి. దినదినాభివృద్ధి చెందిన ఆ గర్భం నుంచి మారిష అనే వనకన్య జన్మించింది. ఆమె కాలాంతరంలో ప్రాచేతసులకి భార్య అయ్యింది. దక్షుడు ఆమెకు జన్మించిన పుత్రుడే.

కండుముని ప్రమ్లోచ వెళ్ళిపోగానే ఎంతో పశ్చాత్తాపపడి తనుచేసిన పాపం నుంచి విముక్తి పొందటానికి పురుషోత్తమ క్షేత్రానికి చేరుకున్నాడు. దర్శించినంతనే ముక్తిని ప్రసాదించే వైకుంఠనాథుడైన పురుషోత్తముణ్ణి చూసి భక్తి ప్రపత్తులతో ఈవిధంగా

## బ్రహ్మ పారస్తుతి

పారంపరం విష్ణురపారపారః పరః పరేభ్యః పరమార్థరూపః ।
సబ్రహ్మపారః పరపారభూతః పరః పర పరణామపి పారపారః ॥

సకారణం కారణం సంశ్రితోஉపి తస్యాపిహేతుః పరహేతుహేతుః ।
కార్యేపిచైష సహకర్మకర్తృ రూపైరనేకైరవతీహ సర్వమ్ ॥

బ్రహ్మప్రభుర్బ్రహ్మస సర్వభూతో బ్రహ్మ ప్రజానాం పతిరచ్యుతోஉసౌ ।
బ్రహ్మవ్యయం నిత్యమజం స విష్ణురపక్షయా ద్యైరఖిలై రసంగః ॥

బ్రహ్మక్షర మజం నిత్యంయదాஉసౌ పురుషోత్తమః ।
తదారాగాదయో దోషాః ప్రయాంతు ప్రశమం మమ ॥

*(శ్లో॥ 115-118, అధ్యా-178)*

"శ్రీమహావిష్ణువు అన్నిటికీ కారణభూతుడు. సకలకార్యాలకీ కారణమైనవి పంచభూతాలు, పంచతన్మాత్రలు వాటికి కారణమైనవాడు, అహంకారానికి మహతత్త్వం అనేది కారణం. ఆ మహతత్త్వానికి కూడా కారణమైనవాడు. శ్రీమహావిష్ణువే ఈ సమస్తానికీ రక్షకుడుగా వున్నాడు. ఆయన వేదస్వరూపుడు, వేదాంగాల స్వరూపం కూడా ఆయనదే. వేదార్థాన్ని బోధించే స్మృతుల్ని రచించిన మనువుకి ఈయనే ప్రభువు. షడ్భావవికారాలు లేనివాడు, అవ్యయయుడు, చావు, పుట్టుకలు లేనివాడు, నాశనరహితుడు అయిన పురషోత్తముడికి నమస్కారం. ఈ పురుషోత్తముణ్ణి స్తుతిస్తున్న నాకు రాగద్వేషాలు శమించుగాక! "అని పరమభక్తితో ప్రార్థించాడు.

కండుముని చేసిన బ్రహ్మపారాన్ని విని సంతోషించిన పురుషోత్తముడు వెంటనే గరుత్మంతుణ్ణి అధిరోహించి ప్రత్యక్షమయ్యాడు. కండమునితో "ఓ మహర్షీ! నీ బ్రహ్మ పారస్తవానికి నేను సంతృప్తి చెందాను. నీకు ఏం వరం కావాలో కోరుకో" అని అన్నాడు. పురుషోత్తముడి స్వరం విన్న కండుముని కళ్ళు తెరిచాడు. ఎదురుగా దివ్యమంగళాకారుడైన పురుషోత్తముడు ఆయనకి కనిపించాడు. తన తపస్సు ఫలించిందని ఆనందించి భక్తవత్సలుడైన ఆ మహాపురుషుణ్ణి ఈ విధంగా స్తుతించాడు.

## కండుముని చేసిన పురుషోత్తమ స్తోత్రము

నారాయణ! హరే! కృష్ణ! శ్రీవత్సాంక! జగత్పతే!
జగద్బీజ! జగద్ధామ! జగత్సాక్షిన్న మో ఽ స్తుతే ॥

అవ్యక్త! జిష్ణో! ప్రభవ! ప్రధాన! పురుషోత్తమ ।
పుండరీకాక్ష! గోవింద! హృషీకేశ! నమోస్తుతే॥

హిరణ్యగర్భ ! శ్రీనాథ పద్మనాభ! సనాతన!
భూగర్భ! ధ్రువ! ఈశాన! హృషీకేశ! నమోస్తుతే ॥

అన్యాద్యంతామృతాజేయ ! జయత్వం జయతాం వర! ।
అజితాఖండ! శ్రీకృష్ణ! శ్రీనివాస! నమోస్తుతే ॥

పర్జన్య ధర్మకర్తాచ దుష్పార దురధిష్ఠిత!
దుఃఖార్తినాశన! హరే! జలశాయిన్నమోఽస్తుతే ॥

భూతపావ్యక్త భూతేశ భైతత్వైరనాకుల ! భూతాధివాస ।
భూతాత్మన్భూతగర్భ! నమోఽస్తుతే ॥

యజ్ఞ! యజ్ఞన్యజ్ఞధర ! యజ్ఞధాతా ఽ భయప్రద !
యజ్ఞగర్భ! హిర్యణ్యాంగ ! పృశ్ని గర్భ! నమో ఽ స్తుతే ॥

క్షేత్రజ్ఞః క్షేత్రభృతేక్షత్రీ క్షేత్రహా క్షేత్రకృద్వశీ!
క్షేత్రాత్మ నేక్షేత్ర రహిత! క్షేత్ర స్రష్టే నమోఽస్తుతే ॥

గుణాలయ! గుణావాస! గుణాశ్రయ! గుణావహా!
గుణభోక్త! గుణారామ! గుణాత్యాగిన్న మోఽస్తుతే ॥

త్వం విష్ణుస్త్వంహరిశ్చక్రీత్వం జిష్ణుస్త్వం జనార్ధనః ।
త్వంభూత స్త్వంవషట్కారస్త్వంభవ్య స్త్వంభవత్ప్రభుః ॥

త్వంభూతకృత్త్వమవ్యక్తస్త్వం భవోభూతభృద్భద్ధవాన్ ।
త్వంభూతభావనో దేవస్త్వామాహుర జమీశ్వరమ్ ॥

త్వం మనంతః కృతజ్ఞస్త్వం ప్రకృతి సత్త్వం వృషాకపిః ।
త్వం రుద్రస్త్వం దురాధర్జస్త్వ సత్త్వ మమోఘస్త్వమీశ్వరః ॥

త్వం విశ్వకార్మజిష్ణు స్తంలు త్వంశంభుస్త్వంవృషాకృతిః ।
త్వం శంకరస్త్వముశనాత్వం సత్యం త్వం తపోజనః ॥

త్వం విశ్వజేతాత్వం శర్మత్వం శరణ్యస్త్వమక్షరమ్ ।
త్వం శంభుసస్త్వం స్వయంభూశ్చత్వం జేష్ఠ సత్త్వంపరాయణః ॥

త్వమాదిత్య సత్త్వమోంకారస్త్వం ప్రాణస్త్వంతమిస్రహా ।
తం పర్జన్యసస్త్వం ప్రథిత వేధాస్త్వంసురేశ్వరః ॥

త్వమృగ్యజుః సామచైవ త్యమాత్మాసంమతోభవాన్ ।
త్వ మగ్నిస్త్వం చపవనస్త్వ మాపోవసుధా భవాన్ ॥

త్వం స్రష్టాత్వం తథా భోక్తా హోతాత్వం చ హవిః క్రతుః ।
త్వం ప్రభుస్త్వం విభుః శ్రేష్ఠస్తమ లోకపతిరచ్యుతః ॥

త్వం సర్వదర్శనః శ్రీమాంస్త్వంసర్వదమనో రిహా ।
త్వ మహాస్త్వం తథా రాత్రిస్త్వామాహుర్వత్సరం బుధాః ॥

త్వం కాలస్త్వంకలా కాష్ఠాత్వం ముహూర్తః ఓణాలవాః ।
త్వంబాల స్త్వంతథా వృద్ధస్త్వం పుమా స్త్రీ నపుంసకః ॥

త్వం విశ్వయోనిస్త్వం చక్షుస్త్వం వేదాంగస్త్వ మవ్యయః ।
త్వం శాశ్వతసత్త్వ మజితస్త్వముపేంద్రస్త్వముత్తమః ॥

త్వం వేద వేదస్త్వం దాతా విధాతాత్వం సమాహితః ।
త్వం సర్వ విశ్వసుఖదస్త్వం వేదాంగం త్వమవ్యయః ॥

త్వం వేదస్త్వంధాతా విధాతా త్వం సమాహితః ।
త్వం జలనిధిరామూలంత్వం ధాతాత్వం పునర్వసుః ॥

త్వం వైద్య స్త్వంధృతాత్మా చత్వ మతీంద్రియ గోచరః ।
త్వమగ్రణీ ర్గ్రామణీస్త్వం త్వం సువర్ణస్త్వ మాదిమాన్ ॥

త్వం సంగ్రహస్త్వం సుమహత్త్వం ధృతాత్మా త్వ మచ్యుతః ।
త్వం యమస్త్వం చ నిమయస్త్వం ప్రాంశుస్త్వం చతుర్భుజః ॥

త్వమే వాన్నాంతరాత్మాత్వం పరమాత్మా త్వముచ్యతే ।
త్వం గురుస్త్వం గురుతమస్త్వం వామస్త్వం ప్రదక్షిణః ॥

త్వం పిప్పలస్త్వ గురుతమస్త్వం వ్యక్తస్త్వ ప్రజాపతిః ।
హిరణ్యనాభస్త్వం దేవస్త్వ శశీత్వం ప్రజాపతీః ॥

అనిర్దేశ్యవపుస్త్వం వైత్వం యమస్త్వ సురారిహా ।
త్వం చ సంకర్షణో దేవస్త్వ కర్తా త్వం సనాతనః ॥

త్వం వాసుదేవో ఽమేయాత్మాత్వ మేవ గుణవర్జితః ।
త్వం జేష్ఠస్త్వం వరిష్ఠత్వం సహిష్ణుశ్చ మాధవః ॥

సహస్ర శీర్షా త్వందేవస్త్వ మవ్యక్తః సహస్రదృక్ ।
సహస్ర పాదస్త్వం దేవస్త్వం విరాట్త్వం సుప్రభుః ॥

త్వమేవ తిష్ఠసే భూయో దేవదేవ దశాంగులః ।
యద్భూతం తత్త్వమేవోక్తః పురుషః శక్ర ఉత్తమః ॥

యద్భావ్యం తత్త్వ మీశానస్త్వమృతస్త్వ తథా ఽమృతః ।
త్వత్తోరోహత్యయం లోకోమహీయాంస్త్వ మనుత్తమః ॥

త్వం జాయాన్పురుషస్త్వం చ త్వం దేవ దశథాస్థితః ।
విశ్వభూత శ్చతుర్భాగోనవభాగోఽమృతో దివి ॥

నవభాగో ఽన్తరిక్షస్థః పౌరుషేయః సనాతనః ।
భాగద్వయం చ భూసంస్థం చతుర్భాగోఽప్యభూదిహ ॥

త్వత్తో యజ్ఞాః సంభవంతి జగతో వృష్టికారణమ్ ।
త్వత్తో విరాట్సముత్పన్నో జగతో హృది యఃపుమాన్ ॥

సోఽతిరిచ్యత భూతేభ్య స్తేజసాయశసాశ్రియా ।
త్వత్తః సురాణా మాహారః పృషదాజ్య మజాయత ॥

గ్రామ్యారణ్యా శ్చౌషధయ స్త్వత్తః పశుమృగాదయః ।
ధ్యేయధ్యాన పరస్త్వం చ కృతవా నసి చౌషధీః ॥

త్వం దేవదేవ సప్తాస్య కాలాఖ్యో దీప్తవిగ్రహః ।
జంగమాజంగమం సర్వం జగదేత చ్చరాచరమ్ ॥

త్వత్తః సర్వ మిదం జాతం త్వయి సర్వం ప్రతిష్ఠితమ్ ।
అనిరుద్ధస్త్వం మాధవస్త్వం ప్రద్యుమ్నః సురారిహా ॥

దేవ! సర్వసుర శ్రేష్ఠ! సర్వలోక పరాయణ!
త్రాహిమామరవిందాక్ష నారాయణ నమోఽస్తుతే ॥

నమస్తే భగవన్విష్ణో నమస్తే నమస్తే పురుషోత్తమ ।
నమస్తే సర్వలోకేశ । నమస్తే కమలాలయ ॥

గుణాలయ! నమస్తే ఽస్తు గుణాకర ।
వాసుదేవ! నమస్తే ఽస్తు నమస్తే ఽస్తు సురోత్తమ ॥

జనార్ధన నమస్తేఽస్తు సనాతన।
నమస్తే యోగినాం గమ్య। యోగావాస నమోస్తుఽతే ॥

గోపతే। శ్రీపతే విష్ణో నమస్తేఽస్తు మరుత్పతే ।
జగత్పతే జగత్సూతే నమస్తే జ్ఞానినాం పతే ॥

దివస్పతే నమస్తే ఽస్తు మహీపతే ।
నమస్తే మధుహంత్రే చ నమస్తే పుష్కరేక్షణ ॥

కైటభఘ్న నమస్తే ఽస్తు సుబ్రహ్మణ్య నమోస్తుతే ।
నమోఽస్తుతే మహామీన శ్రుతి పృష్ఠధరాచ్యుత ॥

సముద్రసలలిలక్షోభ పద్మజాహ్లాద కారిణే ।
అశ్వశీర్ష మహాఘోణ మహాపురుష విగ్రహ ॥

మధుకైటభ హంత్రే చ నమస్తే తురగానన ।
మహాకమఠ భోగాయ పృధివ్యుద్ధరణాయ చ ॥

విధృతాద్రి స్వరూపాయ మహాకూర్మాయ తే నమః ।
నమో మహావరాహాయ పృథివ్యుద్ధార కారిణే ॥
నమశ్చాఽఽది వరాహాయ విశ్వరూపాయ వేధసే ।
నమోఽనంతాయ సూక్ష్మాయ ముఖ్యాయ చ వరాయ చ ॥
పరమాణు స్వరూపాయ యోగిగమ్యాయ తేనమః ।
తస్మైనమో కారణ కారణాయ ॥
యోగీంద్ర వృత్తి నిలయామ సుదుర్విదాయ ।
క్షీరార్ణవాశ్రిత మహాహిసుతల్పగాయ ।
తుభ్యం నమః కనకరత్న సుకుండలాయ ॥

తన గురించి ఎంతో ఆర్తితో కండుముని చేసిన స్తోత్రం విన్న పురుషోత్తముడు సంప్రీతుడై కండుమునీ! నీ భక్తి ప్రపత్తులతో నా హృదయాన్ని స్పందింపచేసావు. నీ కోరిక చెప్పు అని మరల అడిగాడు. "జగన్నాథా! పురుషోత్తమా! తలచుకుంటేనే శరీరం జలదరించే సంసార మాయలో నేను చిక్కుకుపోయాను. విషయవాసనల వ్యామోహంలో పడి ఇంద్రియ నిగ్రహాన్ని కోల్పోయాను. నాకిక నీవే దిక్కు. కృష్ణా! మధుసూదనా నన్ను ఉద్ధరించు. పునరావృత్తి రహితమైన ముక్తిని ప్రసాదించు" అని కోరుకున్నాడు కండుముని,

కండుమునీ! చింతించకు. నీవు నాకు పరమభక్తుడివి. కేవలం నన్ను ఆరాధిస్తే చాలు, స్త్రీ లైనా మరే కులం వారికైనా మోక్షాన్ని అనుగ్రహిస్తాను. అలాంటిది నీకు ప్రసాదించటంలో నాకు అభ్యంతరమేముంటుంది. కుక్కమాంసం తినేవాడైనా సరే నా మీద శ్రద్ధాభక్తులు కలిగి వుంటే చాలు వాడికి విముక్తి లభిస్తుంది. కనుక నీవు నిరంతరం నన్నే ధ్యానిస్తూ వుండు. శరీర పతనానంతరం నాలోకానికి చేరుకుంటావు" అని చెప్పి అంతర్ధానమయ్యాడు శ్రీహరి.

మహావిష్ణువు మాటవిని కండుముని ఎంతో ఆనందపడ్డాడు. ఆనాటి నుంచి ఎలాంటి కోరికలు లేకుండా నిశ్చల చిత్తంతో, అహంకార మమకారాలని

వదిలి పురుషోత్తముణ్ణి ధ్యానిస్తూ కాలం గడిపి చివరికి దుర్లభమైన పరమపదానికి చేరుకున్నాడు కండుముని. పరమభక్తుడు, మహాతపస్వి అయిన కండుముని చరిత్రని ఎవరు వింటారో! వారికి సకల పాపాలు హరిస్తాయి.

## సంసార చక్రం

పూర్వం ఋషులందరూ వ్యాసభగవానుడి దగ్గరకి వెళ్ళి స్వామీ! సర్వజ్ఞా! వ్యాసా! మానవుడికి సహాయంగా వుండేది తండ్రి, తాత, కొడుకు, గురువు, జ్ఞాతులు, బంధువులు, మిత్రులు వీరిలో ఎవరు? మనిషి మరణించగానే అతడి శరీరాన్ని కట్టెలా పారేస్తారు కదా! మరి ఆ నరుడి వెంట వెళ్ళేది ఎవరు? అని ప్రశ్నించారు. వ్యాసుడు వారికి సమాధానం చెబుతూ

ఋషివర్యులారా! నరుడు ఒక్కడుగానే జన్మిస్తాడు. ఒక్కడుగానే మరణిస్తాడు. ఒక్కడే కష్టాల్ని అనుభవిస్తాడు. ఒక్కడే వాటిని అధిగమిస్తాడు. జీవుడు ఎప్పటికీ నిస్సహాయుడే. మనిషి మరణిస్తే ఆ శవం దగ్గర కొంతసేపు ఏడ్చి బంధువులు తిరిగి వెళ్ళిపోతారు. దహనం చేయబడ్డ ఆ నరుడితో వెళ్ళేది కేవలం ధర్మం ఒక్కటే. మరెవ్వరూ మరేదీ మనిషిని వెంబడించి వెళ్ళలేదు. కనుక ధర్మం అనేది ఎంతో గొప్పదని గుర్తించి, అది పుణ్యలోకాలకి వెళ్ళటానికి తమకి సాయం చేస్తుందని గ్రహించి మానవులు ధర్మాచరణ చెయ్యాలి. ధర్మమార్గంలోనే సంచరించాలి.

లోభంవల్ల, మోహం వల్ల, భయంవల్ల మహాపండితుడు కూడా ఇతరులకోసమో! లేక స్వార్థం కోసమో తప్పులు (ధర్మవిరుద్ధమైన పనులు) చేస్తుంటాడు. అర్థం, కామం, అనే రెండు పురుషార్థాల్ని కూడా ధర్మబద్ధంగానే పొందాలి" అని ప్రబోధించాడు. వ్యాసుడి వచనాలు విన్న మునులు సంతోషించి "స్వామీ! శరీరం నాశనం ఎలా అవుతుంది? మానవుడి శరీరం దహనమైన తరువాత అతడి శరీరం సూక్ష్మరూపంలో కనిపించకుండా వుంటుంది కదా! మరి ధర్మం దాన్ని ఎలా వెంబడిస్తుంది? అని తిరిగి ప్రశ్నించారు.

ఋషులారా! భూమి, ఆకాశం, నీరు, నిప్పు, వాయువు, మనసు, బుద్ధి అన్నవి ఏకీభావం చెంది ధర్మాన్ని చూస్తాయి. అన్ని జీవులు చేసే పాపపుణ్య కర్మలకి రాత్రి పగలు అనేవి సాక్ష్యులుగా వుంటాయి. జీవుడు సూక్ష్మశరీరంతో ధర్మం వెంట వెళుతుంది. మానవుడి చర్మం మాంసం, శుక్రం, రక్తం, ఎముకలు ఇవన్నీ ప్రాణం పోయిన వెంటనే శరీరంతో పాటూ నశిస్తాయి. కేవలం ధర్మం ఒక్కటే నశించకుండా అతడి వెంట వెళుతుంది అన్నాడు వ్యాసభగవానుడు. స్వామీ! చాలా సంతోషం. ఇక మాకు రేతస్సు (వీర్యం)ఎలా ప్రవర్తిస్తుంది? పిండం ఎలా ఉత్పత్తి అయి వృద్ధి చెందుతుంది? అనే విషయాలు తెలియచేయండి" అని ప్రార్ధించారు.

విప్రశేష్ఠులారా! మానవుడి శరీరంలో వున్న ఇంద్రియాధిష్ఠాన దేవతలు అతడు తిన్న అన్నాన్ని స్వీకరిస్తారు. వారు శరీరం లోపల భూమి, నీరు, నిప్పు, ఆకాశం, వాయువు, మనస్సు అనే రూపంతో వుంటారు. లోపలవున్న పంచభూతాలు ఆహారాన్ని స్వీకరించి సంతృప్తి చెందుతారు. వారు తృప్తి పడగానే శరీరంలో శుద్ధమైన రేతస్సు పుడుతుంది. పురుషుడిలో ఏర్పడ్డ ఆ రేతస్సు స్త్రీతో అతడు సంగమించినప్పుడు అది ఆమె అండాన్ని చేరి గర్భంగా రూపొందుతుంది అని చెప్పాడు వ్యాసుడు.

వ్యాసమహర్షీ! మానవుడిలో వున్న ఆత్మ ఎముకల్ని, చర్మాన్ని, మాంసాన్ని విడిచిపెట్టి ఎక్కడ వుండి సుఖ దుఃఖాల్ని అనుభవిస్తుంది? అని అడిగారు. జీవుడు పంచభూతాలతో తాదాత్మ్యం చెంది వాటికి లోనై వుంటాడు. ప్రాణం పోయాక వాటిని వదిలి మరో శరీరంలోకి ప్రవేశిస్తాడు. అప్పుడు జీవరూపంలో వున్న మానవుడు చేసే పాపపుణ్యాలని పంచభూతాలలో అంతర్యామిగా వున్న దేవతలుచూస్తారు అని చెప్పాడు వ్యాసుడు.

మహాభాగా! జీవుడు చర్మాన్ని, ఎముకలను మాంసాన్ని విడిచిపెట్టి, పంచభూతాలనీ వదిలిపెట్టి తనంత తానుగా సుఖదుఃఖాలను అనుభవిస్తాడా? అని మునులు తిరిగి ప్రశ్నించారు. వ్యాసుడు వారికిలా చెబుతున్నాడు.

జీవుడు తను చేసిన కర్మలను అనుసరించి స్త్రీ ద్వారా తిరిగి జన్మిస్తాడు. మరణించాక యమభటుల వల్ల ఎన్నో భాధల్ని పొందుతాడు. ఈ మధ్యలో సంసారచక్ర పరిభ్రమణంలో చిక్కుకుని నానాబాధలు పడుతుంటాడు. భూలోకంలో ఆ ప్రాణి పుట్టింది మొదలు మరణించేంత వరకు ఇంతకుముందు తాను చేసిన పుణ్యపాపాలను అనుసరించి సుఖదుఃఖాలు అనుభవిస్తాడు. పుట్టినప్పటినుంచి ధార్మిక కార్యాలే చేస్తున్నట్లైతే అతడు నిత్యం సుఖాలే పొందుతాడు. అధర్మాలు ఆచరించినవాడు నరకానికి వెళ్ళి అక్కడ మహాబాధల్ని అనుభవించి, తిరిగి పశుపక్ష్యాది జన్మల్ని ఎత్తుతాడు. అలా జీవుడు తనకుతానే సుఖదుఃఖాలు అనుభవిస్తాడు.

## పాపాలు చేసినవారు పొందే జన్మలు

1.నాలుగువేదాలు చదివిన విప్రుడు మోహంతో పతితుడైన వాడిదగ్గర దానం స్వీకరిస్తే గాడిద జన్మనెత్తుతాడు. ఆ గాడిదరూపంలో 15 సంవత్సరాలు జీవిస్తాడు. తరువాత ఎద్దుజన్మనెత్తి ఏడు సంవత్సరాలు జీవిస్తాడు. ఆ తరువాత బ్రహ్మరాక్షసుడిగా పుట్టి మూడు సంవత్సరాలుండి ఆ పై తిరిగి బ్రాహ్మణుడిగా జీవిస్తాడు. 2. కులభ్రష్టుడి చేత యజ్ఞాలు చేయించినవాడు పురుగుగా పుడతాడు. ఆ పురుగురూపంలో పదిహేను సంవత్సరాలు జీవించి, ఐదు సంవత్సరాలు గాడిదగా, ఐదు సంవత్సరాలు నక్కగా, ఒక సంవత్సరం కుక్కగా జన్మలు పొంది జీవించి, చివరికి తిరిగి మానవజన్మనెత్తుతాడు. 3. ఉపాధ్యాయుడి గురించి ఉద్దేశపూర్వకంగా పాపం చేసిన శిష్యుడు మూడు జన్మలెత్తి సంసార బాధలు అనుభవిస్తాడు. 4.గురుపత్ని మీద శిష్యుడు మనసులోనైనా చెడుతలపుని తెచ్చుకుంటే భయంకరమైన సంసార యాతనలు అనుభవిస్తాడు.

ఏ పుత్రుడు తల్లితండ్రుల్ని అవమానపరుస్తాడో గాడిద జన్మనెత్తుతాడు. తల్లి తండ్రుల్ని కొట్టినవాడు డేగ జన్మ ధరిస్తాడు. యజమాని అన్నాన్ని దొంగలించినవాడు కోతి అవుతాడు. విశ్వాస ఘాతకుడు చేపగా పుడతాడు. ధాన్యాల్ని, యవల్ని దొంగిలించేవాడు ఎలుక జన్మనెత్తుతాడు. ఇతరుల భార్యతో

సుఖించినవాడు తోడేలవుతాడు. సోదరుడి భార్యని బలాత్కరించినవాడు కోకిలజన్మనెత్తి ఒక సంవత్సరమే జీవిస్తాడు. స్నేహితుడి, గురువు, రాజు భార్యల్ని కామించేవాడు పందిగా పుడతాడు. మొదట తన కూతుర్ని ఒకరికిస్తానని వాగ్ధానం చేసి తిరిగి ఆ కన్యని వేరొకడికిచ్చి వివాహం చేసినవాడు కృమిగా జన్మిస్తాడు. పితృతిథిని పెట్టక, వారికి కనీసం తర్పణాలు కూడా వదలనివాడు కాకిగా జన్మించి వంద సంవత్సరాలు జీవిస్తాడు. పెద్ద అన్న తండ్రితో సమానం అలాంటివాడిని అవమానించి సోదరుడు బెగ్గురుపక్షిగా పుడతాడు. చేసిన మేలు మరిచి ప్రవర్తించేవాడు యమలోకానికి చేరి కఠిన శిక్షలనుభవిస్తాడు.

పెరుగు దొంగతనం చేసినవాడు కొంగ జన్మ ఎత్తుతాడు. పచ్చి చేపల్ని హరించినవాడు తేనెటీగగా, ముల్లంగిని దొంగలించినవాడు చీమగా పుడతాడు. పాయసాన్ని చౌర్యం చేసినవాడు తీతువుపిట్టగా, అప్పాలని దొంగలించినవాడు గుడ్లగూబగా, మంచినీళ్ళు హరించినవాడు కాకిగా, కంచు వస్తువుల్ని చౌర్యం చేసినవాడు పచ్చపిట్టగా, వెండిగిన్నెల్ని కాజేసినవాడు పావురంగా, బంగారు బిందెని దొంగిలించినవాడు కృమిగా, పట్టుబట్టల్ని దొంగిలించినవాడు తీతువుపక్షిగా, పట్టు పురుగుల్ని హరించినవాడు నర్తకుడిగా, వస్త్రాల్ని దొంగలించినవాడు చిలుకగా, నారవస్త్రాల్ని ఎత్తుకుపోయినవాడు హంసజన్మని ఎత్తుతారు. అలాగే నూలువస్త్రాల్ని దొంగిలించినవాడు తీతువు పక్షిగా, గొర్రె ఉన్నిని చౌర్యం చేసినవాడు చకోరపక్షిగా పుడతాడు.

చందనం గంధం తదితర సుగంధ ద్రవ్యాల్ని హరించినవాడు చుంచుగా, పాలు దొంగతనం చేసినవాడు బలాక పక్షిగా, నూనె హరించినవాడు గబ్బిలంగా, ధనాన్ని కొట్టి దొంగిలించినవాడు గాడిదగా, వాయిద్యాన్ని హరించినవాడు గొర్రెగా, పిండిని, అన్నాన్ని దొంగిలించినవాడు మూషికం(ఎలుక)గా, నేయిని హరించినవాడు నీరు కాకిగా, చేపమాంసాన్ని దొంగిలించినవాడు కాకిగా, ఉప్పుని చౌర్యం చేసినవాడు బొంతకాకిగా జన్మిస్తారు.

ఈ విధంగా వివిధరకాల పాపాలు చేసినవారు ఆయా పాపాలకి అనుగుణమైన జన్మల్ని పొంది ఘోరమైన కష్టాల్ని అనుభవిస్తుంటారు. మానవుడు పాపాలు చేసాక వచ్చే పశుపక్ష్యాది జన్మల్ని ఎత్తినప్పుడు ధర్మా ధర్మాలవిచక్షణ తెలుసుకోలేడు. అధర్మాలు ఎక్కువ చేసినవాడు మరుజన్మలో లోభ మోహాలకి వశమైన మ్లేచ్ఛుడిగా (అనార్యుడు, గోమాంసాన్ని భక్షించేవాడు, అపశబ్దాల్ని మాట్లాడేవాడు, శిష్టాచారాల్ని పాటించని కామరూపాది దేశాల్లో ఉండేవాడు) జన్మిస్తాడు. పుట్టినప్పటినుంచి ఎవరు పాపాల్ని చేయటం విడిచిపెట్టినవారో వారు ఆరోగ్యవంతులుగా, ఐశ్వర్యవంతులుగా, సౌందర్యవంతులుగా అవుతారు. ఇప్పుడు చెప్పిన పాపకర్మలు వాటి ద్వారా పొందే జన్మలు స్త్రీలకి కూడా వర్తిస్తాయి.

**పశ్చాత్తాపవిధి :** అధర్మమైన పాపాల్ని చేసిన వాడు నరకానికి చేరుకుంటాడు. అయితే పొరపాటున తెలియక అధర్మ కార్యాలని ఆచరించినవాడు చేసిన పాపానికి చింతిస్తూ పశ్చాత్తాపాన్ని పొందితే ఆ పాప ఫలితాన్ని అనుభవించడు. ఎంత వరకూ మానవుడి మనసు దుష్టకార్యాలను గర్హిస్తుందో అంతవరకూ అతడి ఉపాధి శరీరం (సూక్ష్మ) అధర్మం నుంచి విడిగా వుంటుంది. అనగా అధర్మం అనేది అతడికి అంటదు. తాను చేసిన పాపకార్యాన్ని ధర్మ పరులైన విప్రులకి చెప్పి పశ్చాత్తాప పడ్డట్లయితే తన తప్పు నుంచి విముక్తి పొందగలడు. ఎవరైనా నా పొరపాటున చేసిన తప్పుల్ని నిస్సంకోచంగా నలుగురి మధ్యా వెల్లడిస్తూ వున్నా కొద్దీ, దాని ద్వారా వచ్చే దోషం తగ్గిపోతూ వుంటుంది. ఇక మానవులు తాము చేసిన పాపాల ఫలితాన్ని అనుభవించకుండా వుండాలంటే దాన ధర్మాలు చేయాలి. ఆ దానాలలో అన్నిటికన్నా గొప్పది అన్నదానం.

## అన్నదాన మాహాత్మ్యం

శాస్త్రంలో చెప్పిన అన్నిరకాల దానాల కన్నా అన్నదానమే అన్నిటికన్నా గొప్పది. ధర్మాన్ని ఆచరించాలనుకునేవారు ఉదారబుద్ధితో అన్నదానం చేయాలి. మనుషులకి అన్నమే ప్రాణం. అన్నం వల్లనే జీవుడు పుడుతున్నాడు. ఈ ప్రపంచం మొత్తం అన్నంలోనే ప్రతిష్ఠితమైవుంది. అందువల్ల అన్నం ప్రశంసనీయమైనది.

అన్నదానం వల్ల స్వర్గం లభిస్తుంది. మానవుడు తన శక్తిని అనుసరించి ఎంత లభిస్తుందో అంత అన్నాన్ని ద్విజులకి పెట్టాలి.చేసే అన్న దానాన్ని నిండు మనసుతో వేదాధ్యయనం చేస్తున్న బ్రాహ్మణులకి చేయాలి. ఒక్కసారిగా పదిమంది బ్రాహ్మణులకి సంతృప్తిగా ఎవడు భోజనాన్ని పెడతాడో వాడు నీచమైన పశుపక్ష్యాది జన్మల్ని ఎత్తడు.

పదివేలమంది యోగ్యులైన విప్రులకి అన్నసంతర్పణ చేసిన వాడు పూర్వం తానుచేసిన వివిధ రకాల పాపాలనుంచి విముక్తి పొందుతాడు. వేదాలు చదువుకుంటూ భిక్షాటన ద్వారా సేకరించిన అన్నాన్ని తిరిగి వేదవేత్త అయిన విప్రుడికి (గురువుకి) పెట్టినవాడు, ఇహలోకంలో సుఖ సంతోషాలు పొందుతాడు. క్షత్రియుడు బ్రాహ్మణుల ధనానికి హానిచేయకుండా న్యాయంగా తన పరిపాలన కొనసాగించాలి. తాను బలాత్కారంగా ఇతరుల నుంచి సేకరించిన అన్నాన్ని విప్రులకి దానం చేయకూడదు. నిండుమనసుతోనే అన్నాన్ని దానం చేయాలి.

వ్యవసాయం చేసుకునే వైశ్యుడు తాను సంపాదించిన ద్రవ్యంలో ఆరోవంతు పవిత్రంగా దానంచేస్తే పాపాలనుంచి విముక్తుడౌతాడు. అదేవిధంగా శూద్రులు కూడా ద్విజులకి అన్నదానం చేస్తే పాపాలనుంచి విముక్తిపొందుతారు. న్యాయంగా సంపాదించిన సొమ్ముతో వృద్ధులైన వేదపండితులకి అన్నదానం చేసిన వాడు స్వర్గలోకానికి చేరుకుంటాడు. అన్ని రకాల దానాలు చేసిన వారికన్నా అన్నదాతలు గొప్పవారు. వారివల్లనే సనాతనధర్మం నిలుస్తుంది.

అబంధ్యం దివసం కుర్వాదన్నదానేన మా నవః ।
భోజయిత్వా శతం నిత్యం నరోవేదవిదాంవరమ్ ॥

న్యాయవిద్ధర్మ విదుషామిహాస విదాం తథా ।
నాయాతి నరకం ఘోరం సంసారం న చ సేవతే ॥

*(శ్లో॥ 29-30, అధ్యా 213)*

ఏ గృహస్తుడు ముందుగా మూడు ప్రాణాహుతుల్ని సమర్పించి అన్నాన్ని ఆరగిస్తాడో, ఎవడు అన్నదానం చేసి రోజుని సార్థకం చేసుకుంటాడో, నిత్యం వేదవిదుల్ని, ధర్మవేత్తల్ని, ఇతిహాసపురాణవిదులు వందమందిని ఎవడు మృష్టాన్న భోజనంతో సంతృప్తి పరుస్తాడో అతడు ఘోరమైన నరకబాధలు అనుభవించడు. సాంసారకూపంలో చిక్కుకుపోడు. ఇహలోకంలో అన్ని సుఖాలు అనుభవించి మరణానంతరం ఉత్తమ లోకాల్ని చేరుకుంటాడు. మరుజన్మలో ధనవంతుడుగా పుడతాడు.

## సదాచారాలు

గృహస్థధర్మాన్ని ఆచరించేవాడు నిరంతరం ఆచారాల్ని పాటించాలి. ఆచారాలు పాటించనివాడికి ఇహపరాల్లో రక్షణ వుండదు. సదాచారాలను ఉల్లంఘించేవాడికి యజ్ఞ, జప దానాలు సుఖాన్నీయవు. దురాచారపరుడికి పూర్ణాయుర్దాయం వుండదు. కనుక ధర్మపరమైన ఆచారాలను పాటించాలి. వాటి లక్షణాలు ఈ విధంగా ఉంటాయి.

గృహస్థుడన్న ప్రతివాడు ధర్మార్థ కామాలనే మూడు పురుషార్థాలను సాధించే ప్రయత్నం చేయాలి. అది గనుక సిద్ధిస్తే ఇహం పరం రెండూ సిద్ధించినట్టే. ఈ పురుషర్థాల ధర్మాన్ని నాలుగోవంతు ఆచరించినా ఇహపరసిద్ధి కలుగుతుంది. సగం నిర్వర్తిస్తే తనను తాను ఇహలోకంలోనే ఉద్ధరించుకోగలడు. నాలుగోవంతు సదాచారాలను నిర్వర్తించినవాడు ధర్మాన్ని వృద్ధి చేయగలడు. ఈ పురుషార్థాలలో అర్థ–కామాలని కూడా ధర్మబద్ధంగానే ఆచరించాలి. అలా చేస్తేనే సద్గతులు కలుగుతాయి.

ప్రతిరోజూ బ్రాహ్మీ మూహూర్తంలో అనగా తెల్లవారు ఝామునే మేలుకుని ఆ రోజు చేయాల్సిన ధర్మార్థపురుషార్థ సాధన గురించి ఆలోచించాలి. ఆ తరువాత ఆచమనం చేసి స్నానాదికాలు నిర్వర్తించుకుని శుచిగా నక్షత్రాలున్న సమయంలోనే సంధ్యా వందనాన్ని ఆచరించాలి. సాయం సంధ్యని సూర్యుడు ఇంకా వుండగానే చేయాలి. ఏదైనా అనుకోని ఆటంకం ఆపద వస్తే తప్ప

నిత్యం సంధ్యావందనాన్ని ఆచరించి తీరాలి. గృహస్థుడు నాస్తికాది మతాలకు సంబంధించిన సంభాషణలు, దుష్టులతో వివాదాలను అధర్మమైన పనులు చేసేవారిని సేవించటం మానుకోవాలి. ప్రతిరోజు నియమంగా ప్రాతఃకాలం సాయం సమయాలలో హోమాన్ని చేయాలి.

సూర్యోదయాన్ని, సూర్యాస్తమయాన్ని చూడకూడదు. తలదువ్వుకోవటం, అద్దాన్ని చూడటం, దంతధావనం చేసుకోవటం, కాటుక పెట్టుకోవటం వంటి పనులు పూర్వాహ్నంలోనే చేయాలి. దేవపితృఋషి తర్పణాలనుకూడా పూర్వాహ్నంలోనే చేయాలి. గ్రామాలలో, ఇళ్ళబైట, తీర్థాలు, క్షేత్రాలు, నలుగురూ నడిచేదారులూ, దున్నిన పొలాలు వంటి ప్రదేశాలలో మూత్రవిసర్జన చేయకూడదు. దిగంబరంగా వున్న ఇతర స్త్రీలని, తన మలాన్ని చూడరాదు. బహిష్ఠు అయిన స్త్రీని చూడటం, తాకటం, పలకరించటం చేయకూడదు. నీటిలో మూత్రాన్ని, మలాన్ని విసర్జించకూడదు. మూత్రాన్ని, మలాన్ని, వెంట్రుకల్ని, బూడిదని, బొగ్గులు, తెగిపోయినతాళ్ళు, గుడ్డపీలికలు, దారిలో పడిన చింపిరి గుడ్డలు మొదలైన వాటిని తొక్కకూడదు.

ప్రతిరోజు గృహస్థుడు పితృదేవతల్ని, దేవతల్ని, ఋషుల్ని, మనుషుల్ని అర్చించిన తరువాతే భోజనాన్ని చేయాలి. భోజనం చేసేడప్పుడు తూర్పు ఉత్తర దిశలవైపు ముఖాన్ని చేయివుంచి ఆహారాన్ని భుజించాలి. భుజించేడప్పుడు చెడిపోయిన అన్నం గురించి తప్ప మరేవిధంగా అన్నాన్ని దూషించరాదు. కేవలం ఉప్పు ఎప్పుడూ తినకూడదు. అలాగే ఎంగిలి కూడా భుజించకూడదు. నడుస్తూ లేక నుల్చుని మూత్ర, మలాలని విసర్జించకూడదు. ఎంగిలి నోటితో మాట్లాడకూడదు. వేదాలు చెప్పకూడదు. సూర్య చంద్ర నక్షత్రాలని ఉద్దేశ పూర్వకంగా చూడకూడదు. విరిగిన ఆసనాన్ని, మంచాన్ని, పగిలిన పాత్రల్ని వాడకూడదు.

పెద్దలు వచ్చినప్పుడు లేచి నుంచుని వారికి స్వాగతం పలికి, ఆసనాన్ని ఇవ్వాలి. పెద్దలతో అనుకూలంగా సంభాషించాలి. వారు తిరిగి వెళ్ళేటప్పుడు

వారితో సహా కొంచెం దూరం వెళ్ళి సాగనంపాలి. ఏకవస్త్రంతో భోజనం, దేవతార్చక, బ్రాహ్మణుల్ని ఆహ్వానించటం, హోమంచేయటం చేయకూడదు. నగ్నంగా స్నానం చేయకూడదు. అలాగే నిద్రించకూడదు. రెండుచేతులతో లుకని గోకరాదు. అకారణంగా మాటిమాటికీ తలమీద స్నానం చేయకూడదు. తలమీద స్నానం చేసాక వంటికి నూనె రాయకూడదు. అనధ్యయనం రోజుల్లో వేదాధ్యయనం చేయకూడదు. బ్రాహ్మణుడిని, అగ్నిని, గోవుని, సూర్యభగవానుణ్ణి ఎప్పుడూ అవమానించకూడదు.

పగటిపూట ఉత్తరాభిముఖంగా, రాత్రిపూట దక్షిణాభిముఖంగా, ఇబ్బందికర పరిస్థితుల్లో ఏ దిశలోనైనా మలమూత్రవిసర్జన చేయవచ్చు. గురువు చేసే తప్పుని ఎత్తి చూపకూడదు. ఆయన ఒకవేళ కోపం ప్రదర్శిస్తే క్షమించమని ప్రార్థించి ప్రసన్నుణ్ణి చేసుకోవాలి. ఇతరులు చేసే అపవాదాలను వినకూడదు. మహారాజుకి, పిచ్చివాడికి, విప్రుడికి, పండితుడికి, గర్భిణీస్త్రీకి, బాధతో వెళ్ళేవాడికి, కుంటి, గ్రుడ్డి, మూగ, చెవిటి వాళ్ళకి, మత్తెక్కిన వాడికి, దారి ఇచ్చి మనమే పక్కకి తొలగివెళ్ళాలి. దేవాలయం, పుణ్యవృక్షం కనిపిస్తే వాటికి ప్రదక్షిణ చేసి వెళ్ళాలి.

ఇతరులు వాడిన పాదరక్షలు, వస్త్రాలు, పూలమాలలు మొదలైన వాటిని ధరించకూడదు. చతుర్దశి, అష్టమి, పూర్ణిమ వంటి పర్వదినాలలో అభ్యంగన స్నానం, స్త్రీ సంగమం చేయకూడదు. చేతులు, పిక్కలు పైకెత్తి నుంచోకూడదు. పాదాలని అటూ ఇటూ ఆడించరాదు. ఒక కాలితో ఇంకొక కాలిని త్రొక్కరాదు. వ్యభిచారిణిని, తప్పుచేసిన తరువాత పసిబాలుణ్ణి, జాతిభ్రష్టుణ్ణి, అన్యాపదేశంగా తిట్టటం, నిందించటం, చేయకూడదు. నేనే గొప్పవాణ్ణి నాకే అన్నీ తెలుసు అన్న డాంభికమైన మాటల్ని పలకకూడదు. మూర్ఖులను, పిచ్చివాళ్ళను, కష్టాలలోవున్న వారిని, అంగవైకల్యం కలిగినవారిని, ధనహీనుల్ని చూసి పరిహాసంతో కించపరచకూడదు. తన శిష్యుల్ని పుత్రుల్ని శిక్షించటం కోసం ఇంకొకరి చేతికి దండాన్ని ఇవ్వకూడదు.

కాలితో కూర్చునే ఆసనాన్ని దగ్గరకి లాగి కూర్చోకూడదు. కేవలం తనకు తానే భుజించటం కోసం సంయావం (గోధుమపిండితో చేసిన పదార్థం) కృశరం (పులగం) మాంసం వీటిని సేకరించరాదు. ఉదయం సాయంత్రం అతిథులకి పెట్టి తాను భుజించాలి. తూర్పు ఉత్తర దిశగా తిరిగి దంతధావనం చేసుకోవాలి. నిషిద్ధమైన దంతకాష్టాలని (పళ్ళుతోమే పుల్లల్ని) వాడకూడదు. ఉత్తర, పడమర దిశల్లో తలపెట్టి నిద్రపోకూడద. దక్షిణ దిశగా తలవుంచి నిద్రపోతే శుభం. పరిమళమైన ద్రవ్యాలు రాసుకుని నిద్రించకూడదు. అలాగే ఉషఃకాలంలో కూడా నిద్రపోకూడదు.

గ్రహణం సంభవించినప్పుడు దాని విడుపుస్నానాన్ని విడిచిన వెంటనే చేయాలిగానీ మర్నాడు ఉదయం చేయకూడదు. (రాత్రి చంద్రగ్రహణాలు పట్టినప్పుడు) ఉప్పుని తినకూడదు. నిలువఉన్నది, తడి ఆరిపోయింది, పాడైపోయింది అయిన అన్నాన్ని తినరాదు. పొడి కూరలు, చెరుకు, పాలు మాంసం వంటి పదార్థాలతో తయారు చేసిన పదార్థాలు నిలువ ఉన్నప్పటికీ వాటిని తినవచ్చు. సూర్యోదయం సూర్యాస్తమయ సమయాలలో నిద్రించరాదు. స్నానం చేయకుండా, కూర్చోకుండా, మనసు నిలకడలేకుండా మంచంమీద వట్టి నేలమీద కూర్చుని చప్పుడు చేస్తూ, లేక మాట్లాడుతూ భోజనం చేయకూడదు. సేవకులకి పెట్టకుండా తినరాదు. స్నానం చేసిన తరువాత భోజనం చేయటం ఉత్తమం, ఇతరుల భార్యలతో సంగమించకూడదు. దానివల్ల ఆయువు క్షీణిస్తుంది. అంతేకాదు యజ్ఞయాగాలు చేయటం, బావులు చెరువులు, సత్రాలు నిర్మించటం, తోటలు వేయించటం లాంటి ధర్మకార్యాల ద్వారా సంక్రమించిన పుణ్యమంతా కూడా నశిస్తుంది.

ఆచమనం చేసిన తరువాతే దేవ, అగ్ని, పితృకార్యాలను, గురువందనాన్ని, భోజనాన్ని చేయాలి. ఆచమనం చేయటానికి ఉపయోగించే జలం పవిత్రంగా వుండాలి. ఆచమనం చేసేడప్పుడు చప్పుడు చేయకూడదు. తూర్పు లేక ఉత్తరదిశకు తిరిగి ఆచమించాలి. నీళ్ళ నుంచి తీసింది,

ఇంటి పెరట్లో వున్నది, ఎలుక కలుగులోంచి తీసింది, పుట్టనుంచి తీసింది అయిన మట్టిని శౌచ క్రియకి ఉపయోగించకూడదు. కాళ్ళు చేతులు కడుక్కుని తలమీద నీటిని ప్రోక్షణ (చల్లుకొని) చేసుకుని స్థిరమైన మనసుతో మూడు లేక నాలుగు సార్లు ఆచమనం చేసి రెండుసార్లు పెదవుల్ని తుడుచుకుని కళ్ళని రెండు సార్లు తాకి శుచిగా సంధ్యా వందనాది క్రియల్ని ఆచరించాలి.

తుమ్మువచ్చినప్పుడు, అపానవాయువు వెలువడినప్పుడు, ఉమ్మివేసిన తరువాత ఆచమనం చేయాలి. అలాగే మైలుతో ఉన్నవాడిని తాకినప్పుడు సూర్యుణ్ణి చూడాలి. వెంటనే కుడిచెవిని తాకాలి. ఈ కుడిచెవిని తాకటం అన్నది సూర్యదర్శనం ఆచమనం చేయటానికి అవకాశం లేనప్పుడే చేయాలి. పళ్ళని ఎపుడూ పటపటా అని కొరకకూడదు. తన శరీరాన్ని తానే గుద్దుకోకూడదు. పడుకొనేటప్పుడు, దారిలో నడుస్తున్నప్పుడు, ఆహారం భుజించేడప్పుడు స్వాధ్యాయం చేయకూడదు. సంధ్యా సమయాలలో మైథునాన్ని, ప్రయాణాలని  చేయకూడదు.

అపరాహ్నకాలంలోనే పితృతర్పణాలు చేయాలి. దేవ పితృకార్యాలు చేసేడప్పుడు శిరఃస్నానం చేయవచ్చు. తూర్పు లేదా ఉత్తర దిశవైపు ముఖం ఉంచి క్షవరకార్యక్రమాన్ని చేయించుకోవాలి. అంగవైకల్యం ఉన్న స్త్రీని వివాహం చేసుకోరాదు. ఉత్తమకులంలో పుట్టింది ఆరోగ్యంగా వున్నది అయిన కన్యని పెళ్ళాడాలి. తండ్రివైపు ఏడోతరం, తల్లివైపు అయిదో తరానికి చెందిన స్త్రీని మాత్రమే స్వీకరించాలి. పగటికాలంలో నిద్ర మైథునాలు చేయకూడదు. ఇతరులకి బాధకలిగించే పనులు, జంతువుల్ని హింసించటం చేయకూడదు.

బహిష్టులైన స్త్రీని అన్ని వర్ణాలవారు రాత్రిపూట వెలుపల ఉంచాలి. ఐదో రోజు కూడా ఆమె బైటేవుంటే ఆమెకిక స్త్రీ జన్మరాదు. అనగా అయిదోరోజు సంగమానికి దూరంగా వుండి ఆరో రోజు మాత్రమే సంగమించాలి. స్త్రీని ఋతుదినాలైన మొదటి పదహారు రోజుల్లో సరిదినాల్లో పొందవచ్చు. పురుషుడు సరి రాత్రుల్లో సంగమిస్తే పుత్రులు, బేసిరాత్రుల్లో సంగమిస్తే స్త్రీ సంతానం

కలుగుతారు. పర్వదినాల్లో సంధ్యా సమయాల్లో సంగమిస్తే అధర్మపరులు లేదా నపుంసకులు జన్మిస్తారు. రిక్తతిథిలో క్షురకర్మ చేయించుకోకూడదు. వినయం లేనివాడు ఏదిచెప్పినా అది వినకూడదు.

నీచులకి అత్యున్నతమైన స్థానాన్ని ఇవ్వకూడదు. క్షురకర్మ చేయించుకున్న తరువాత స్త్రీసంభోగం చేసాక, సంతకువెళ్ళి వచ్చాక తలమీద స్నానం చేయాలి (వస్త్రాలతో సహా) దేవతల్ని, గురువుల్ని, సాధువుల్ని, సత్యవంతుల్ని, మహాత్ముల్ని, పతివ్రతల్ని, బ్రహ్మయజ్ఞాలు చేసేవారిని దూషించటం, అప్రతిష్ఠపాలు చేయటం చేయకూడదు. వారిని పరిహసించకూడదు.

తెల్లని వస్త్రాలు, తెల్లనిపూలు ధరించి ఎప్పుడూ మంగళప్రదంగా అలంకరించుకున్న వారికి (స్త్రీ పురుషులకి) అమంగళాలు కలుగవు. తలపొగరు వున్నవారితో, పిచ్చివారితో, మూర్ఖులతో, వినయహీనులతో, నీచగుణాలు కలవారితో, డబ్బుని వృధాచేసేవారితో, శత్రువులతో, కార్యదక్షులు కానివారితో, జారులతో, నిరుపేదలతో, వాదం చేసేవారితో, అధములతో స్నేహం చేయకూడదు.

మిత్రుడు, యజ్ఞం చేసినవాడు, రాజు, స్నాతకుడు (గురుకులంలో విద్యని పూర్తి చేసినవాడు) మామగారు తన ఇంటికి వచ్చినప్పుడు యథాశక్తి వారిని గౌరవించాలి. ఉన్నంతలో లోటు లేకుండా వారిని సత్కరించాలి.

నీటిని అగ్నిని ఒకేసారి పట్టుకోకూడదు. గురువులు, దేవతలు, తల్లితండ్రులు, విప్రులు వీరివైపు పాదాలు చాచి కూర్చోకూడదు, పడుకోకూడదు. పాలు కుడుపుతున్న ఆవుని చూడకూడదు. దోసిలితో నీళ్ళు త్రాగకూడదు. మలమూత్ర విసర్జన అవసరం కలిగినప్పుడు ఆలస్యం చేయరాదు. నోటితో నిప్పుని ఆర్పకూడదు. వైద్యుడు, ఏరు, విప్రుడు, లేని ఊరిలో నివసించకూడదు. బలశాలి, ధర్మతత్పరుడు అయిన రాజు ఏ దేశంలో వుంటాడో అక్కడే నివసించాలి.

**తినదగినవి–తినకూడనివి :** నేయి నూనె కలిపి చేసిన పదార్థాలు, నిలువవున్న అన్నం విడిచిపెట్టాలి. అనగా తినకూడదు. గోధుమయవలు, ఆవుపాలు, పెరుగు, నేయి వంటి వాటితో చేసిన పదార్థాలు నిలువ వున్నవైనా భుజించవచ్చు. కుందేలు, తాబేలు, ఉడుము, పందిచేప అనేవి తినదగిన పదార్థాలు. ఊరపంది, కోడి తినరానివి. పితృశేషం, దేవశేషం, శ్రాద్ధకాలంలో విప్రులకి పెట్టే ఉద్దేశంతో ప్రోక్షించకూడబడింది, ఔషధం కోసం వినియోగించబడేది అయిన మాంసాన్ని తిన్నా దోషం కలుగదు.

**శుద్ధి విధానం :** బంగారం, వెండి, శంఖం, రాయి, తాళ్ళు, వస్త్రాలు, కూరలు, దుంపలు, పళ్ళు, పూవులు, చర్మం మణులు, ముత్యాలు పాత్రలు, యజ్ఞపాత్రలు, ఇవి నీళ్ళతో కడిగితే చాలు శుద్ధి అవుతాయి. రాతి చిప్పలు నీటితో కడిగితే చాలు దానికి జిడ్డుపడితే వేడినీళ్లతో కడగాలి. చేట, చర్మం, రోకలి, రోలు, ముతక వస్త్రాలు ప్రోక్షణ చేస్తే (నీటిని చల్లితే) చాలు శుద్ధి అవుతాయి. నారవస్త్రాలు, చవుడు మట్టి, ఎండబెడితే శుద్ధి అవుతాయి. గొర్రె ఉన్నితో చేసిన వస్త్రాలను ఆవాలు నువ్వులు ముద్దతో పరిశుభ్రం చేయాలి. దట్టమైన నూలు బట్టల్ని కూడా పైవాటితోనే శుద్ధి చేయాలి.

కర్ర, దంతం, ఎముకలు, కొమ్ములు అనేవాటిని నీళ్ళతో కడిగినా, బూడిదతో తోమినా శుద్ధమవుతాయి. అంటుకుండలు తిరిగి వండటానికి పనికిరావు. బ్రహ్మచారి సన్యాసి మొదలగువారి భిక్షాన్నం. వడ్రంగి, శిల్పి, హస్తం అంగడిలోని వస్తువులు, స్త్రీముఖం శుద్ధమైనవి. దారిలో పడివున్నది, తెలియకుండా త్రొక్కింది, దాసిచేత తోమబడినది ఆదిలో పరిశుద్ధమైనవే. స్థానభ్రంశం పొందని వెంట్రుక, ముసలివాళ్ళు రోగపీడితులు చేసినపని, సత్కర్మ చేసేవారి ఇళ్ళు, వాకిళ్ళు స్త్రీల స్తనాలు పవిత్రమైనవి. ప్రవాహంలో వున్ననీరు,వాసన లేని నీరు పరిశుద్ధమైనవి.

భూమి కాలంచేత, అగ్ని దాహంచేత, నీరు మార్జనం చేత, ఆవులు త్రొక్కటం చేత పవిత్రమవుతాయి. ఇల్లు అలకటం, నీళ్ళతో తడపటం, నీళ్ళు

చల్లటం వల్ల పరిశుద్ధమవుతుంది. వెంట్రుకలతో, పురుగులతో దూషితమైనప్పుడు, ఆవు వాసన చూసినప్పుడు, ఈగలు వాలినప్పుడు, అన్నం, మట్టి, నీరు, భస్మాలను కొంచెం చిమ్మటం వల్ల, ప్రోక్షణం చేయటం వల్ల అవి పవిత్రమవుతాయి. చింతపండు రసంతో-మేడికర్రతో చేసిన పాత్రలు, తగరం, సీసంతోచేసిన కర్రతో చేసిన పాత్రలు, తగరం, సీసంతో చేసిన గిన్నెలు పరిశుద్ధమవుతాయి. కంచుగిన్నెలు బూడిదతో తోమితే పవిత్రమవుతాయి. ద్రవపదార్థాలు ఏవైనా తోమితే పవిత్రమవుతాయి. ద్రవపదార్థాలు ఏవైనా అశుచిగా అయితే వాటిపై నున్న నీటిని కొంచెం పారబోస్తే సరి. ఇతర వస్తువులు ఏవైనా అపవిత్రమైతే వాటిరంగు, వాసన తొలగిపోయే దాకా తోమితే తిరిగి అవి శుభ్రమవుతాయి.

దుకాణం నుంచి తెచ్చిన నూనె, ఆవులు త్రాగిన నీరు, ధూళి, అగ్ని, గుర్రాలు, ఆవునీడ, సూర్యకిరణాలు, గాలి, భూమి వంటివి నీటి చినుకులు, ఈగలు లాంటి దుష్ట వస్తువుల స్పర్శ తగిలినా అపవిత్రం కావు. ఇక మేకలు గుర్రాలు ముఖంతోనే పవిత్రాలు.

## వర్ణాశ్రమ ధర్మాలు

మానవసమాజంలో బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులనే నాలుగు వర్ణాలున్నాయి. ఈ నాలుగు వర్ణాలవారు పాటించే ధర్మాలనే వర్ణాశ్రమ ధర్మాలంటారు.

**బ్రాహ్మణ ధర్మాలు :** బ్రాహ్మణుడు - దానం, దయ, తపస్సు, దేవ, పితృదేవతా యజ్ఞాలు, స్వాధ్యాయం అనేవి ప్రధాన ధర్మాలని ఆచరించాలి. నిత్యం చలికి వెరవకుండా స్నానాన్ని చేయాలి. అగ్నిని ఉపాసించాలి. జీవన భృతికోసం ఇతరుల చేత యజ్ఞయాగాది క్రతువులు చేయించవచ్చు.యజ్ఞ నిర్వహణ కోసం ఇతరుల దగ్గరనుంచి ద్రవ్యాన్ని స్వీకరించవచ్చు. బ్రాహ్మణుడికి షట్కర్మలు (యజనం-యాజనం-అధ్యయనం-అధ్యాపనం దానం-ప్రతిగ్రహణం) చెప్పబడ్డాయి. వాటిలో ప్రతిగ్రహణం కూడా ఒకటి. విప్రుడు ఏకార్యాన్నైనా లోకహితం కోసమే చేయాలి. సర్వభూతాలతో మైత్రీ భావాన్ని వహించాలి. కేవలం ఋతుసమయంలోనే భార్యతో సంగమించాలి.

**క్షత్రియ ధర్మాలు :** క్షత్రియుడు త్రికరణశుద్ధిగా విప్రులకి దాన ధర్మాలుచేయాలి. వారిచేత యజ్ఞయాగాది క్రతువుల్ని దేశ రక్షణకోసం చేయించాలి. లోకాన్ని, దేశాన్ని రక్షించటం కోసం అస్త్రాన్ని ధరించటం క్షత్రియుడి ధర్మం. భూమిని ధర్మబద్ధంగా పాలించటం క్షత్రియుడి కర్తవ్యం. దుష్టుల బారినుంచి యజ్ఞయాగాది క్రతువుల్ని సంరక్షించటం, దుష్టశిక్షణ శిష్టరక్షణ చేయటం, వర్ణాశ్రమవ్యవస్థ సక్రమంగా అమలయ్యేలా చూడటం అనేవి రాజు ఆచరించవలసిన ప్రధాన ధర్మాలు.

**వైశ్య ధర్మాలు :** పశుపాలన చేయటం, వర్తక, వాణిజ్యాలని, వ్యవసాయాన్ని చేయటం వైశ్యుల ధర్మం. అదే వారి జీవన వృత్తి. వైశ్యులు కూడా యజ్ఞయాగాది క్రతువులకి దాన ధర్మాలు చేయాలి. బ్రాహ్మణుల్ని పోషించటం, వారిచేత పుణ్యకార్యక్రమాలని జరిపించటం కూడా వైశ్యుల ధర్మమే. అందుకోసమే వారు క్రయవిక్రయాది వ్యాపారాలని నిర్వహించాలి.

**శూద్రధర్మం :** శూద్రులు కూడా దానధర్మాలు చేయవచ్చు. వ్యవసాయ కార్యక్రమంలో వైశ్యులకి అండదండలందించి, భూమిని దున్ని పంటలు పండించటం శూద్ర ధర్మం. వీరు కూడా దేవగో బ్రాహ్మణులందరినీ సేవించవచ్చు. పోషించవచ్చు.

ఈ విధంగా నాలుగు వర్ణాలవారికీ ప్రధాన వర్ణాశ్రమ ధర్మాలు చెప్పబడ్డాయి. కేవలం ఋతుకాలంలోనే భార్యతో సంగమించటం, సర్వభూతదయ, ఓర్పు, క్షమాగుణం, సత్యం, శౌచం, సర్వజనమైత్రి, ప్రియంగా మాట్లాడటం, మంగళకరమైన కార్యక్రమాలు చేయటం అన్ని వర్ణాల వారూ ఆచరించాల్సిన ధర్మాలు. ఇవిగాక బ్రాహ్మణులు ఆచరించాల్సిన మరికొన్ని ఉపధర్మాలు కూడా ఇలా చెప్పబడ్డాయి.

అత్యవసర సమయంలో ఆపద్ధర్మంగా విప్రుడు క్షత్రియధర్మాన్ని, క్షత్రియుడు వైశ్యధర్మాన్ని, వైశ్యుడు శూద్రుడు ఆచరించే ధర్మాన్ని అవలంబించవచ్చు.

అయితే వైశ్య శూద్రులు మాత్రం ఆపదకాలంలో కూడా స్వధర్మాన్ని విడిచి పెట్టకుండా వుంటే మంచిది. కర్మ సాంకర్యం ఎప్పుడూ చేయకూడదు. అనగా వర్ణాశ్రమ ధర్మాలని సాధారణంగా ఒకరివి ఒకరు ఆచరించకూడదు.

## ఆశ్రమ ధర్మాలు

**1. బ్రహ్మచర్యాశ్రమధర్మం :** బాలుడు ఎనిమిది సంవత్సరాల లోపు ఉపవీతుడై గురుగృహంలో నివసిస్తూ వేదాధ్యయనాన్ని చేయాలి. స్నాతకుడయ్యే వరకూ బ్రహ్మచర్యాన్ని అవలంబించాలి. నిత్యం ఆచారాన్ని సాంప్రదాయాల్ని పాటిస్తూ గురుశుశ్రూష చేయాలి. (శుశ్రూష అంటే వినాలనే కోరిక. అనగా గురువు చెప్పిన మాటలు విని ఆ ప్రకారంగా నడుచుకోవటం) బ్రహ్మచర్య నియమాలని శ్రద్ధగా పాటించాలి. నిత్యం ఉభయ సంధ్యల్లో అగ్నికార్యం చేయాలి. గురువు నిలబడితే తానూ నిలబడి, ఆయన నడిస్తే ఆయన వెంటనే నడిచి, ఆయన కూర్చుంటేనే తానూ ఆయన కన్నా క్రింద కూర్చోవాలి. గురువుకి ఇష్టంలేని పని చేయకూడదు. ఆయన ఎదురుగా వున్నప్పుడు వేరే ఆలోచనలు చేయకూడదు. తాను భిక్షాన్నాన్ని సేకరించి ముందుగా దాన్ని గురువుకి నివేదించి తీర్థస్నానం ఆచరించాక తాను స్నానాన్ని చేయాలి. ఆయన కోసం సమిధలు, నీరు ఎప్పుడూ అందుబాటులో వుంచాలి. నేర్చుకునే విద్య పూర్తికాగానే గురుదక్షిణ సమర్పించి ఆయన్ని సంతృప్తి పరచాలి.

**2. గృహస్థాశ్రమధర్మాలు :** గృహస్థాశ్రమంలోకి ప్రవేశించినవాడు దేవతల్ని, పితృదేవతల్ని అతిథుల్ని సంతృప్తి పరచాలి. పితృదేవతల్ని తర్పణాల ద్వారా, దేవతల్ని యజ్ఞయాగాల ద్వారా, అతిథుల్ని అన్నదానాల ద్వారా, మునుల్ని స్వాధ్యాయనం ద్వారా, ప్రజాపతిని బలికర్మలద్వారా, భూతాలని సత్యవచనాల ద్వారా అర్చించిన మానవుడు గృహస్థుడు తను చేసిన ఈ పుణ్యకర్మల వల్ల పుణ్యలోకాలకి చేరుకుంటాడు. నిత్యం భిక్షని ఆశించే సన్యాసులు, బ్రహ్మచారులు గృహస్థుణ్ణే ఆశ్రయించి ఉంటారు. కనుక గార్హస్థ్యధర్మం అన్ని ధర్మాలకన్నా గొప్పది. వేదాధ్యయనం కోసం, తీర్థయాత్రలు చేయటానికని

బ్రాహ్మణులు తిరుగుతుంటారు. అలా తిరిగేవారు, సాయంకాలం అయ్యేసరికి నిలువనీడ కోసం, ఆహారం కోసం ఎదురుచూస్తూంటారు. గృహస్థుడు అలాంటివారికి ఆశ్రయాన్నివ్వాలి. మధురమైన మాటలతో హృదయపూర్వకంగా వారికి స్వాగతం పలకాలి. లోపలికి వచ్చిన అతిథిని భగవంతుడుగా భావించి యథాశక్తి భోజనాన్ని, విశ్రమించటానికి శయ్యని సమకూర్చాలి.

ఎవడైతే అసంతృప్తిగా గృహస్థుడి ఇంటిని విడిచి వెళ్ళిపోతాడో, ఆ వెళ్ళిన అతిథికి చెందిన పాపం ఆ ఇంటియజమానికి తగిలి అతడి పుణ్యఫలం అతిథికి చెందుతుంది. గృహస్థుడు అహంకరించటం, ఈసడించటం, డాంబికాలు పలకటం, నిందలు వేయటం, పరుషంగా మాట్లాడటం వంటివి చేయకూడదు. ఏ గృహస్థుడైతే తన ధర్మాన్ని సక్రమంగా పాటించి దేవ ఋషి, ముని, గురు, పితృదేవ, అతిథుల్ని సేవిస్తాడో అతడు ఉత్తమ లోకాలను నిస్సందేహంగా పొందగలడు.

**3. వానప్రస్థాశ్రమ ధర్మం :** వయస్సు మీదపడ్డాక గృహస్థుడు వానప్రస్థానాశ్రమాన్ని స్వీకరించాలి. తన భార్యని కుమారులకి అప్పగించి, వనానికి (అడవికి) వెళ్ళాలి. ఒక వేళ భార్య కూడా అతన్ని అనుసరించి వస్తానంటే ఆమెని కూడా వెంట తీసుకువెళ్ళవచ్చు. అక్కడ వనంలో ఒక ఆశ్రమాన్ని నిర్మించుకుని, రాలిన ఆకుల్ని, కంద మూలాలను తింటూ, జుట్టూ గెడ్డం పెంచుకుని, నేలమీదనే శయనిస్తూ మునివృత్తిని అవలంబించాలి. రెల్లదర్భతో అల్లిన లేక నారతో చేసిన వస్త్రాలను మాత్రమే ధరించాలి. మూడు వేళల్లో క్రమం తప్పకుండా స్నానం చేయాలి. నిత్యం దేవతార్చన, హోమం అతిథిసేవ, బలిప్రదానం వానప్రస్థులు ఆచరించాల్సిన ప్రధాన ధర్మాలు. ఆ విధంగా చలి, ఎండల్ని సహిస్తూ వాన ప్రస్థాశ్రమ ధర్మాన్ని నియమంగా ఆచరించివాడు అన్ని దోషాల్నీ పోగొట్టుకుని శాశ్వతంగా పుణ్యలోకాలకు చేరుకుంటాడు.

**4. సన్న్యాసాశ్రమ ధర్మం :** ఆశ్రమాలలో చివరిది సన్న్యాసాశ్రమం. ఇది భిక్షువులకు సంబంధించింది. భార్య, పిల్లలు, మిత్రులు, బంధువులు వీరితో సంబంధ బాంధవ్యాలను విరమించుకోవాలి. అసూయ ఏమాత్రం ఉండకూడదు. అన్నిరకాల కర్మల్నీ విడిచిపెట్టాలి. అందరిమీదా సమానమైన భావన కలిగి వుండాలి. జరాయువలు, అండజాలు (పక్షులు) స్వేదజాలు (చెమట ద్వారా పుట్టిన క్రిములు) ఉద్భిజాలు (విత్తనాలు నుంచి పుట్టిన వృక్షాలు) వీటికి త్రికరణశుద్ధిగా ఎలాంటి హింసని తలపెట్టకూడదు. సర్వసంగ పరిత్యాగం చేయాలి. ఒక ఊరిలో ఒకరాత్రి ఒక నగరంలో కేవలం అయిదు రాత్రులు మాత్రమే నివసించాలి. పశుపక్ష్యాదుల మీద ప్రేమగానీ, ద్వేషం కానీ వుండకూడదు.

ప్రాణం నిలుపుకోవటం కోసమే జనం భుజించిన తరువాత ఉత్తమ వర్ణాలవారి దగ్గరకు భిక్షాటనకి వెళ్ళాలి. ఒకవేళ భిక్షలు లభించకపోతే బాధపడకూడదు. ఎక్కువ భిక్ష లభించినా ఆనందపడకూడదు. కామం, క్రోధం, లోభం, మోహం అనే దోషాల్ని సంపూర్ణంగా వదులుకొని, నాది, నేను, నేనే అన్న భావాన్ని విడిచిపెట్టి నిర్మముడుగా, నిరహంకారుడుగా వుండాలి. ఆ విధంగా వుండే సన్న్యాసికి శరీరాన్ని విడిచిపెట్టేడప్పుడు ఎలాంటి భయం కలగదు.

సన్న్యాసాశ్రమం స్వీకరించినవాడు తన శరీరంలో వున్న అగ్నిని తన ముఖంలోకి తెచ్చుకుని అగ్నిహోత్ర కర్మని ఆచరించి అనగా తన శరీరంలో వున్న జఠరాగ్నిలో వైశ్వానరాగ్నిని అందులో హవిస్సులుగా పంచాహుతుల రూపంలో ఆహారాన్ని హోమద్రవ్యంగా వ్రేల్చాలి. అదికూడా భిక్షరూపంలో సేకరించిన అన్నాన్నే హోమం చేయాలి. అలా చేసిన సన్న్యాసి నిత్యం అగ్ని చయనం చేసినవారు ఏ లోకాలకి వెళతారో అదే లోకాలకి వెళతాడు. ఇక మోక్షాశ్రమ సన్న్యాసి యథోక్త విధానంగా ఆశ్రమ ధర్మాన్ని నిర్వర్తించి, కట్టెలు లేని నిప్పులాగా ప్రశాంతమైన బ్రహ్మలోకాన్ని పొందుతాడు. ఈ సన్న్యాసాశ్రమవిధి కేవలం ద్విజులకు మాత్రమే చెప్పబడింది.

## సంకరజాతి - వర్ణసాంకర్య లక్షణాలు

బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులు అనే వర్ణవిభాగాలు, స్వభావాన్ని అనుసరించి ఏర్పడ్డాయి. బ్రాహ్మణుడు తన స్వధర్మాన్నే ఆచరిస్తూ నియమబద్ధంగా జీవిస్తే తన బ్రాహ్మణ్యాన్ని పరమావధిగా భావించినవాడవుతాడు. ఎవడైతే బ్రాహ్మణ ధర్మాన్ని విడిచిపెట్టి క్షత్రియ ధర్మాన్ని ఆచరిస్తాడో అతడు తన విప్రధర్మాన్ని కోల్పోయి క్షత్రియులింట జన్మిస్తాడు. ఇదే విధంగా వైశ్యాది వర్ణాలవారి ఇళ్ళలో స్వధర్మాన్ని పరిత్యజించినవాడు జన్మిస్తాడు. ఆ విధంగా శూద్రులింట జన్మించేదాకా పతనమైన విప్రుడు భ్రష్టుడై వర్ణసాంకర్యాన్ని పొందుతాడు.

శూద్రుడు తన ధర్మాన్ని తాను ఆచరిస్తూ విజ్ఞానాన్ని, జ్ఞానాన్ని పొంది, పవిత్రుడై, ధర్మచింతనాపరుడై స్వధర్మాన్ని త్రికరణశుద్ధిగా ఆచరించాలి. అలా ఆచరించినవాడు క్రమంగా ముందు వైశ్య, తరువాత క్షత్రియ, ఆ తరువాత బ్రాహ్మణ వర్ణాలవారి ఇంట జన్మించి బ్రహ్మత్వాన్ని పొందుతాడు.

విప్రుడు ఎప్పుడూ ఉగ్రాన్నం, గుణాన్నం, శ్రాద్ధాన్నం, మైలఅన్నం, మృష్టాన్నం, శూద్రాన్నం తినకూడదు. ఇది పరమప్రమాణంగా ఆచరించాల్సిన ధర్మం.

శూద్రుడు పెట్టగా తిన్న అన్నంకడుపులో వున్నప్పుడు మరణించిన ద్విజుడు శూద్రుడుగా జన్మిస్తాడు. దానికి ప్రాయశ్చిత్తం కూడా లేదు. ఏఏ వర్ణాల వారు పెట్టిన ఆహారం కడుపులో వుండగా ఎవడు చనిపోతాడో వాడు తిరిగి ఆయా వర్ణాలలో జన్మిస్తాడు. దుర్లభమైన బ్రాహ్మణ జన్మఎత్తి తినకూడని అన్నం ఎవడైతే తింటాడో వాడు పతితుడై తీరుతాడు. విప్రుడు సురాపానాన్ని సేవించటం, బ్రహ్మహత్య చేయటం, దొంగతనం, వ్రతభంగం, శౌచలోపం, స్వాధ్యాయలోపం చేసినట్లైతే అతడు లోభిగా, శఠుడిగా మారి, వృషలిని సంగమించి, గురుపత్ని మీద కోరిక పెంచుకుని, గురువుల్ని దూషిస్తూ, పరిహసిస్తూ బ్రాహ్మణ్యం నుంచి పతితుడవుతాడు.

ఎటువంటి పాపాలు చేయకుండా నిత్యం శుభకర్మల్ని ఆచరించే శూద్రుడు సైతం ఉత్తమ బ్రాహ్మణుడవుతాడు. పవిత్ర కర్మల్ని ఆచరిస్తూ మనసుని శుద్ధి చేసుకుని ఇంద్రియ నిగ్రహం కలిగిన శూద్రుడు కూడా బ్రాహ్మణుడిలాగా అందరిచేతా సేవించతగినవాడు. ఇది బ్రహ్మదేవుడు స్వయంగా పలికినమాట. బ్రహ్మ స్వభావాన్ని అనగా సర్వత్రా సమదృష్టి కలిగి వుండటం. ఈ గుణాన్ని ఎవడు కలిగివుంటాడో అతడే ద్విజుడు.

బ్రహ్మ పదార్థమే ఈ లోకంలో బ్రాహ్మణుల రూపంలో సంచరిస్తోంది. బ్రాహ్మణుడు నిత్యం సంతృప్తిగావుంటూ బ్రాహ్మణమార్గాన్ని అనుసరిస్తూ సంహితల్ని అధ్యయనం చేస్తూ ఉత్తమ గృహస్థుడుగా, వేదాధ్యయనం ద్వారా ధనాన్ని సంపాదించకుండా, నిత్య సన్మార్గవర్తిగా, అహితాగ్నుడుగా, అధ్యయన పరుడుగా వుండాలి. అలా వున్నవాడే బ్రహ్మ భావానికి అర్హుడవుతాడు. బ్రాహ్మణుడు ఎప్పుడూ తన బ్రహ్మణ్యాన్ని విడిచిపెట్టకూడదు. మనసుని ఇంద్రియవిషయాలనుంచి నియంత్రించుకుని షట్కర్మల్ని శ్రద్ధగా ఆచరిస్తూ ఎలాంటి వర్ణ సాంకర్యానికీ కారకుడు కాకూడదు. ఇదే విప్రుడు ఆచరించాల్సిన పరమధర్మం.

సత్యవచనాలనే పలుకుతూ, అహంభావం లేకుండా, సుఖదుఃఖాలకి అతీతంగా వుంటూ, బ్రహ్మయజ్ఞాదిక్రతువుల్ని తన అదుపులో వుంచుకుని, గృహస్థధర్మాన్ని సక్రమంగా పాటిస్తూ, వచ్చిన అతిథులకి భోజనం పెట్టి మిగిలిన దానినే స్వీకరిస్తూ ఉత్తమ కర్మల్ని ఆచరించే వైశ్యుడు కూడా బ్రాహ్మణ జన్మని పొందుతాడు. అయితే అతడు తనుచేసిన ధర్మాచరణ వల్ల ముందుగా క్షత్రియ జన్మనెత్తి ఆ జన్మలో కూడా వేదవిహితమైన ధర్మకార్యాలు చేసి మరుజన్మలో విప్రుడుగా పుడతాడు.

## ఉత్తమగతి ప్రాప్తి

**పార్వతీదేవి ప్రశ్న :** పూర్వం పార్వతీదేవి పరమేశ్వరుడితో స్వామీ! మానవులు మానసికం, వాచికం, శారీరకం అని మూడు విధాలైన కర్మ బంధాలలో ఎలా

చిక్కుకుపోతారు? ఏ కర్మల్ని ఆచరించటం ద్వారా వారు ఆ బంధాల నుంచి విముక్తి పొందుతారు? ఎలాంటి పుణ్యకర్మల్ని ఆచరించటం ద్వారా మానవులు స్వర్గాన్ని చేరుకుంటారు? దయచేసి చెప్పండి" అని లోకహితం కోరి ప్రశ్నించింది. ఆమె ప్రశ్నలకి చిరునవ్వుతో పరమేశ్వరుడు ఈ విధంగా సమాధానం చెబుతున్నాడు –

**శివుడి సమాధానం :** దేవీ!సత్యధర్మాలు ఆచరించటం మీద శ్రద్ధకలిగి, శాంతచిత్తులై, అన్నిరకాల బాహ్యవికారాలను విడిచిపెట్టి, సంశయరహితులైన మానవులు ఎప్పటికీ బంధాలకి లోబడరు. అలాంటివారు ఈ జగత్తు ఉత్పత్తి స్థితి, ప్రళయాల తత్త్వాన్ని తెలుసుకుని సర్వజ్ఞులై, ఎలాంటికోరికలూ లేకుండా, కర్మబంధాలనుంచి విముక్తిని పొందుతారు. అలాగే త్రికరణాలతో (మనసా, వాచా, కర్మణా) ఏ ప్రాణినీ హింసించనివారు, మంచి శీలం కలిగినవారు, సర్వప్రాణుల మీదా సమబుద్ధి కలిగినవారు, ఇంద్రియనిగ్రహాన్ని పాటించిన వారు కూడా కర్మబంధాలలో చిక్కుకోక స్వర్గాన్ని పొందుతారు.

ఇతరుల ధనాన్ని ఆశించకుండా, పరస్త్రీల మీద వ్యామోహం లేకుండా, వారిని తల్లిగా, చెల్లిగా భావిస్తూ, తన భార్యని కూడా కేవలం ఋతుకాలంలో మాత్రమే కలుస్తూ, ధర్మంగా ఆర్జించిన ధనంతోనే జీవిస్తూ, దొంగతనాలు చేయకుండా సత్ప్రవర్తనతో జీవించేవారు స్వర్గానికి వెళతారు. దేవీ! అనవసరంగా ఏ ప్రాణికీ అపకారం చేయకపోవటం, మనసుని మాలిన్యం లేకుండా పవిత్రంగా ఉంచుకోవటం, దానం, ధర్మం, సత్కర్మ, తపస్సు, శీలం, శుచిత్వం, దయ కలిగి మానవులు జీవించాలి. ఇది దైవం నిర్ణయించిన ధర్మమార్గం. ఇక వాచిక, మానసిక ధర్మాలు ఎలావుంటాయో చెబుతున్నా విను –

**1. వాచిక ధర్మం :** మానవుడు తనకోసంగానీ, ఇతరుల కోసం గానీ, తన జీవనం కోసం గానీ అసత్యాన్ని పలుకకూడదు. పరుషంగా, కఠినంగా, నిష్ఠురంగా మాట్లాడకూడదు. ఇతరులమీద చాడీలు చెప్పటం, మిత్రభేదాన్ని

కలిగించటం, ఇతరులకి బాధ, ద్రోహం కలిగించటం వంటి మాటలు ఎప్పుడూ మాట్లాడకూడదు. ఎప్పుడూ మృదువుగా, స్వచ్ఛంగా, పవిత్రంగా, అంతఃకరణ శుద్ధిగా, మనోహరంగా మాట్లాడాలి –అలా మాట్లాడినవారు ఉత్తమలోకాల్ని పొందుతారు. ఇదే వాచికధర్మ స్వరూపం.

**2. మానసిక ధర్మం :** మానవుడు తన మనస్సుని చెడు భావాలవైపు ఆకర్షించబడేలా చేస్తే కర్మబద్ధుడైపోతాడు. అరణ్యాలలోకానీ, నిర్జనప్రదేశాలలో కానీ, ఇతరుల ధనం కనిపిస్తే దాన్ని గ్రహించకూడదు. ఏకాంతరంలో ఇతరుల భార్యలు, స్త్రీలు కనిపించినప్పటికీ వారిని వాంఛించకూడదు. శత్రువుల్ని, మిత్రుల్ని సమానదృష్టితో చూడాలి. నిత్యం వేద శాస్త్రాల్ని అధ్యయనం చేస్తూ దయ, శౌచం కలిగి ఏ ప్రాణిమీదా వైరాన్ని పెంచుకోకుండా వుండేవాడు సద్గతుల్ని పొందుతాడు. ఇదే మానసిక ధర్మం అని చెప్పాడు పరమేశ్వరుడు.

**పార్వతీదేవి ప్రశ్న :** పార్వతీదేవి తిరిగి పరమేశ్వరుణ్ణి ప్రశ్నించింది. "ప్రభూ! ఏ కర్మలు చేస్తే ఏ తపస్సులు చేస్తే మానవులకి దీర్ఘాయువు లభిస్తుంది? ఏ కర్మలు చేస్తే వారి ఆయువు క్షీణిస్తుంది? కర్మ విపాక స్వరూపం ఎలా ఉంటుంది? కొందరు ధనవంతులుగా, కొందరు దరిద్రులుగా, అలాగే కొందరు ఉత్తమకులంలో జన్మించటం, మరికొందరు నీచకులాల్లో జన్మించటానికి కారణం ఏమిటి? అని ప్రశ్నించింది.

**శివుడి సమాధానం :** దేవీ! భూలోకంలో జన్మించిన ప్రతిమానవుడూ తనుచేసిన కర్మలకు తగిన ఫలితాల్ని పొందుతాడు. సహజంగా మహాయోగి అయినప్పటికీ ఎప్పుడూ చేతిలో దండాన్ని, ఆయుధాన్ని ధరించి, దయలేకుండా అన్ని ప్రాణుల్నీ హింసిస్తూ, వాటికి భయాన్ని కలిగించేవాడు, కీటకాలనూ పశుపక్ష్యాదులను కూడా హింసించేవాడు నరకానికి వెళతాడు. ఏ హింసా చేయకుండా అహింసా వ్రతాన్ని ఆచరించినవాడు స్వర్గానికి వెళతాడు.

స్వర్గాన్ని చేరిన ధర్మాత్ముడు అక్కడ స్వస్వరూపంలో వుంటాడు. అయితే పాపకర్మల్ని ఆచరించి నరకానికి వెళ్ళినవాడు యమలోకంలో నానావిధాల

బాధల్ని పడి తిరిగి మానవుడుగా జన్మిస్తాడు. వాడు మానవజన్మ ఎత్తినప్పటికీ క్షీణాయువుగానే వుంటాడు. మానవులకి ఆయువు క్షీణించటానికి కారణం అతడు ఆచరించిన పాపకర్మలే.

ఏ మానవుడైతే శుభకర్మల్ని ఆచరిస్తూ ఏ ప్రాణినీ హింసించక, ఆయుధాల ధరించక, తనమీద తనకున్న విధంగానే ఇతర ప్రాణులమీద కూడా ప్రేమభావాన్ని కలిగివుండి, స్నేహభావంతో వర్తించేవాడు దేవత్వాన్ని పొందుతాడు. మరణానంతరం అతడు స్వర్గలోకానికి వెళ్ళి అమరసుఖాలు పొందుతాడు. తిరిగి ఆ మానవుడు ఒకవేళ జన్మిస్తే దీర్ఘాయుష్మంతుడవుతాడు. ఇలా మానవుల దీర్ఘాయువుకి కారణం వారు ఆచరించిన పుణ్య కర్మలే. అని సమాధానం చెప్పాడు శివుడు.

**పార్వతీదేవి ప్రశ్న :** స్వామీ! ఏ కర్మల్ని ఆచరించి, ఏ దానాల్ని చేస్తే మానవుడికి స్వర్గం లభిస్తుంది? అని ప్రశ్నించింది.

**పరమేశ్వరుడి సమాధానం :** దేవీ! బ్రాహ్మణులకు, బీదలకు, ఆర్తులకు భక్ష్యాల్ని భోజనాన్ని వస్త్రాల్ని ఉదార బుద్ధితో దానం చేయాలి. బాటసారులు ఆశ్రయం పొందటానికి తగిన సూత్రాల్ని నిర్మించాలి. నిత్య నైమిత్తిక కర్మల్ని పవిత్రంగా ఆచరించాలి. ఆసనాలు, మంచాలు, వాహనాలు, ఇళ్ళు, రత్నాలు, పొలాలు, ధనం, ధాన్యాలు మొదలైనవి ప్రశాంతమైన మనస్సుతో ఇష్టపూర్తిగా దానం చేయాలి. అలా చేసినవాడు స్వర్గాన్ని చేరుకుంటాడు. పుణ్యఫలం అయిపోయేదాకా అక్కడ సుఖభోగాలను భవించి తిరిగి భూలోకంలో ధనధాన్య సంపదలున్న వాడి ఇంట జన్మిస్తాడు.

తగినంత ఆర్థిక స్తోమత ఉండి కూడా దానం చేయనివాడు, అతిథులు, అభ్యాగతులు, బీదలు, బిక్షకులు వచ్చినప్పుడు వారిని చూసి కనీసం మాటైనా పలకనివాడు, ధనాన్నిగానీ, వస్త్రాల్ని గానీ, గోవుల్ని గానీ, కనీసం అన్నాన్నైనా గానీ దానం చేయకుండా పరమలోభిగా వుండేవాడు, నాస్తికుడు, నరకాన్ని పొందుతాడు. అక్కడ నానావిధ నరక యాతనల్ని అనుభవించిన తరువాత

తిరిగి మానవజన్మ ఎత్తినప్పుడు, ఏ భోగాలూ లేని, కడుదరిద్రంతో అలమటించే బీదవారి ఇంట జన్మిస్తారు.

అల్పబుద్ధితో గౌరవించదగిన వారిని గౌరవించకుండా వుండేవారు, దారి ఇవ్వవలసిన వారికి దారి ఇవ్వనివారు, గురువులతో ప్రేమగా, పవిత్రంగా మాట్లాడని వారు, దురభిమానంతో పెద్దల్ని అవమానించేవారు కూడా నరకానికి వెళతారు. అక్కడ నరకబాధలు అనుభవించి తిరిగి శునకమాంసం తినేవారి బుద్ధిహీనులైన అల్పజాతివారి ఇళ్ళలో జన్మిస్తారు.

**పార్వతీదేవి ప్రశ్న :** పరమేశ్వరా! మానవుల్లో కొందరు జ్ఞానులుగా, మరికొందరు అజ్ఞానులుగా, కొందరు ఆరోగ్యవంతులుగా, మరికొందరు వ్యాధులతో పీడించబడుతూ వుంటున్నారు కదా! దీనికి కారణం ఏమిటి? అని ప్రశ్నించింది.

**పరమేశ్వరుడి సమాధానం :** దేవీ! వేదార్థాల్ని తెలుసుకున్న పండితుల్ని, సిద్ధపురుషుల్ని, ధర్మం తెలిసినవారిని, నిత్యం మంచి చెడ్డల గురించి విచారిస్తూ అశుభకర్మల్ని విడిచిపెట్టి శుభకర్మలనే ఆచరించువాడు ఇహలోకంలో సకల సుఖాలనూ పొంది, మరణానంతరం స్వర్గానికి వెళతాడు. అతడు తిరిగి మానవుడై పుడితే మేధావిగా, సకల శాస్త్రాలు తెలిసిన వాడిగా, యజ్ఞాయాగాది క్రతువుల్ని ఆచరించటంలో ఎంతో ఆసక్తి కలిగినవాడిగా జన్మిస్తాడు.

దుష్టస్వభావాన్ని కలిగి, పరదారలమీద ఆసక్తిని పెంచుకుని, వారిని బలాత్కరించేవాడు, గుడ్డివాడిగా జన్మిస్తాడు. వివస్త్ర అయిన స్త్రీని నీచమైన ఆలోచనలతో చూసేవాడు ఆ పాపఫలితంగా రోగగ్రస్తుడవుతాడు. మూర్ఖుడుగా ప్రవర్తిస్తూ యుక్తాయుక్త విచక్షణ మరిచి కానిచోట్ల మైధునం చేసేవాడు మరుజన్మలో నపుంసకుడవుతాడు. అలాగే పశువులతో రమించేవాడు గురుపత్నితో సంగమించేవారు, వివిధరకాలుగా మైథునాన్ని అతిగా ఆచరించేవారు నపుంసకులుగా పుడతారు అని చెప్పాడు మహేశ్వరుడు.

**పార్వతీదేవి ప్రశ్న :** పరమేశ్వరా! ఏకర్మల్ని విడిచిపెట్టి ఎలాంటి కర్మల్ని ఆచరిస్తే మానవుడు శ్రేయస్సుని పొందుతాడు?

**పరమేశ్వరుడి సమాధానం :** దేవీ! నిజంగా తనకి శ్రేయస్సు కావాలని కోరుకునే మానవుడు, ధర్మమార్గాలని గురించి అవి తెలిసిన పండితుల దగ్గరకి వెళ్ళి వాటిని తెలుసుకుని ఆచరించాలి. ఆ విధంగా శ్రేయోమార్గాల్ని అనుసరించిన వాడు స్వర్గాన్ని పొందుతాడు. తరువాత జన్మలో అతడు మానవుడిగా జన్మించినప్పటికీ ఇంద్రియ నిగ్రహం మేధాశక్తి కలిగిన జ్ఞానిగా పుడతాడు. మానవులకి శ్రేయస్సుని కలిగించేది ధర్మాచరణే అని సమాధానమిచ్చాడు సర్వేశ్వరుడు.

**పార్వతీదేవి ప్రశ్న :** ప్రభూ! లోకంలో కొందరు ధర్మాచారాల పట్ల విముఖంగా వుంటూ కనీసం వాటిని గురించి కూడా తెలుసుకోకుండా వున్నారు? మరికొందరు ధర్మాచరణ చేస్తూ సత్కర్మల్ని ఆచరిస్తూ సదాచారపరులుగా వున్నారు. దీనికి కారణమేమిటి? అని ప్రశ్నించింది.

**పరమేశ్వరుడి సమాధానం :** దేవీ! పూర్వులు చెప్పిన ధర్మశాస్త్రాలను, లోక రీతులను, శాస్త్ర ప్రమాణాలను ఆచరించేవారు దృఢదీక్షతో ఆయాకర్మల్ని శ్రద్ధగా ఆచరిస్తున్నారు. వారు పుణ్యలోకాలను చేరుకుంటారు. మరికొందరు అజ్ఞానంతో అధర్మాన్ని కూడా ధర్మం అని చెబుతూ సద్వ్రతాల్ని ఆచరించకుండా, శాస్త్ర మర్యాదల్ని వదిలేసినవాళ్లు బ్రహ్మరాక్షసులవుతారు. విషయం మీద ఆసక్తి పెంచుకుని యజ్ఞయాగాదుల వంటి వైదికకర్మల్ని ఆచరించినవారు అధములు, భ్రష్టులు అవుతారు" అని పరమేశ్వరుడు మానవులు ఆచరించాల్సిన ధర్మాల గురించి ఆచరించకూడని ధర్మాల గురించి సవివరంగా పార్వతీదేవికి చెప్పాడు.

## వాసుదేవుడి మహిమ

ఒకనాడు పరమేశ్వరుడిని మునీశ్వరులు, దేవర్షులు, మహర్షులు కలిసి ఇలా ప్రార్థించారు. "త్రిలోచనా! పరమేశ్వరా! భూలోకంలో మానవులు అల్పజ్ఞానులు. నిత్యం వారందరూ సంసార బంధాలలో పడి అల్లాడుతున్నారు. అలాంటి దీనులు బంధువిముక్తులయ్యే దారేమన్నా ఉందా ప్రభూ! అని అడిగారు. వారి ప్రశ్నకి పరమేశ్వరుడు ఇలా సమాధానం చెప్పటం ప్రారంభించాడు.

మునీశ్వరులారా! విప్రులారా! కర్మపాశం చేత బంధించబడి దుఃఖాలు అనుభవిస్తున్న మానవులకి వాసుదేవుడు తప్ప మరో గతి లేదు. శంఖ, చక్ర, గదాధరుడైన ఆ మహాపురుషుణ్ణి పూజించేవారందరూ మోక్షాన్ని పొందుతారు. బ్రహ్మకన్నా వేరుగా వుండేవాడు శాశ్వతుడు ఆ మహావిష్ణువు. ఆయనే శ్రీకృష్ణుడు.

ఆకాశంలో ఉదయించిన సూర్యుడిలాగా బంగారు రంగు కాంతిలో ప్రకాశించేవాడు, మహాతేజస్సుతో వెలుగొందేవాడు, పది చేతులతో రాక్షసుల్ని సంహరించినవాడు, శ్రీవత్సాన్ని ధరించి సర్వదేవతలకూ ప్రభువైనవాడు వాసుదేవుడు. అలాంటి వాసుదేవ పరమాత్మ ఉదరం నుంచి బ్రహ్మదేవుడు, శిరస్సునుంచి నేను (శివుడు) ఆవిర్భవించాము. ఆయన శిరోజాల నుంచి జ్యోతిస్సులు, శాశ్వతమైన లోకాలు జన్మించాయి. ఆయన ఆ చతుర్ముఖ బ్రహ్మకు, సకలలోకాలకూ ఆధారమైనవాడు. ఈ భూమినంతటినీ సృష్టించింది ఆయనే. ముల్లోకాలకీ ఈశ్వరుడు, రక్షకుడు సృష్టిమొత్తాన్ని సంహరించేవాడు కూడా వాసుదేవుడే. సర్వజ్ఞుడు, సర్వాన్నీ సృష్టించినవాడు అంతటా ఉన్నవాడు, అన్నివైపులా ముఖాలు కలిగినవాడు అయిన ఆ కృష్ణ పరమాత్మతత్త్వం కన్నా గొప్పతత్త్వం మరేదీ ముల్లోకాలలో లేదు.

సనాతనుడు, ఎప్పుడూ స్థిరంగా వుండేవాడు మహానుభావుడు, గోవిందుడు, సకల ధర్మాల్నీ రక్షించేవాడు, మహామానవంతుడు అయిన ఆ వాసుదేవుడు దేవకార్యం నిర్వహించటం కోసం మానవశరీరాన్ని ధరించి యుద్ధరంగంలో రాజులందరినీ సంహరిస్తాడు. త్రివిక్రముడైన వాసుదేవుడు లేకపోతే భూలోకంలో దేవతలు తమ తమ కార్యాలు నెరవేర్చుకోలేరు. ఆయన సర్వభూతాల చేత నమస్కరించబడేవాడు. సకల భూతాలకూ నాయకుడు. ఆయనకి నాయకుడెవరూలేడు. దేవతలందర్నీ రక్షించేవాడు, జగద్రూపుడు, పరబ్రహ్మ తత్త్వస్వరూపుడు, బ్రహ్మర్షులందరికీ శరణ్యమైనవాడు. పద్మనేత్రుడు, లక్ష్మీదేవి హృదయంలో వున్న వాడు, సాటివాని పరాక్రమం కలిగినవాడు, శార్ఙ్గం, చక్రం, ఖడ్గం, గరుడధ్వజం కలిగినవాడు ఆ వాసుదేవుడు.

చక్కని ఆకారం కలిగినవాడు, ఋజుస్వభావుడు, సౌమ్యమైన ముఖం కలిగినవాడు, అమిత బల వంతుడు దివ్యాస్త్రాలు కలిగినవాడు, యోగమాయతో కూడినవాడు, వేయికళ్ళతో విరూపుడుగా కనుపించే వాడు, ఉన్నతమైన మనసుకలిగినవాడు, అందరికీ ప్రియమైనవాడు, క్షమాగుణం కలిగి, అహంకారం లేనివాడు, భయపడేవారి భయాన్ని పోగొట్టేవాడు, మిత్రుల ఆనందాన్ని బాగా వృద్ధి చేసేవాడు.

శరణ్యం సర్వభూతానాం దీనానాం పాలనే రతః ।
శ్రుతవాన్ అథసంపన్నః సర్వభూత నమస్కృతః ॥
సమాశ్రితానాముపకృత్ శత్రూణాం భయకృత్తథా ।
నీతిజ్ఞో నీతి సంపన్నో బ్రహ్మవాదీ జితేంద్రియః ॥

*(శ్లో॥ 28-29, అధ్యా-226)*

సకల భూతాలకూ శరణు ప్రసాదించేవాడు, దీన జనుల్ని పాలించే పనిమీద ఆసక్తికలిగినవాడు, వేదశాస్త్రాల అధ్యయన యోగ్యత కలిగినవాడు, ఆశ్రితజన రక్షకుడు, సకల శత్రు భయంకరుడు, నీతితత్త్వాన్ని బాగా తెలుసుకున్నవాడు, ఆ తత్త్వాన్ని స్వయంగా సంపూర్ణంగా ఆచరించువాడు, ఇంద్రియాలను జయించినవాడు, బ్రహ్మవాది అయిన ఆ వాసుదేవుడు దేవతల మేలుకోసం ప్రజాపతి మార్గంలో మహాత్ముడైన మనువు వంశంలో జన్మిస్తాడు.

మనుమహారాజుకి అంశుడు, అతడికి అంతర్ధాముడనేవాడు, ఆ అంతర్ధాముడికి పూజ్యుడైన హరిర్ధాముడు, అతడికి ప్రాచీన బర్హి అనేవారు జన్మిస్తారు. ప్రాచీనబర్హికి ప్రచేతసుడు మొదలైన పదిమంది పుత్రులు ఉదయిస్తారు. వారిలో ప్రచేతసుడి కుమారుడైన దక్షుడు ప్రజాపతి అవుతాడు. దక్షప్రజాపతి కుమార్తెలు దాక్షాయణులు అనే నక్షత్రాలు.

సూర్యుడి కుమారుడు వైవస్వత మనువు. ఈ వైవస్వతుడి వంశంలో ఇల-సుద్యుమ్నుడు అనేవారు జన్మిస్తారు. ఇల అనే ఆమెకి బుధుడు జన్మిస్తారు. ఆ బుధుడి కుమారుడు పురూరవసుడు. అతడికి ఆయువు అనేవాడు,

ఆ ఆయువుకి నహుషుడు, నహుషుడికి యయాతి, యయాతికి యదువు, అతడికి క్రోష్ట, ఆ క్రోష్టకి వృజీనీవాన్ అనేవారు జన్మిస్తారు. వృజినీవాన్‌కి మహావీరుడైన ఉషంగుడు జన్మించగా ఆ ఉషంగుడికి చిత్రరథుడు, ఆ చిత్రరథుడికి శూరుడు అనే వాడు క్రమంగా జన్మిస్తారు.

మహావీరుడు, సద్గుణ సంపన్నుడు, గొప్ప కీర్తి కలిగినవాడు అయిన ఆశూరుడికి, వంశాన్ని విస్తరింపచేసేవాడు, వంశోద్ధారకుడు వసుదేవుడు అనే పేరుతో ప్రసిద్ధిచెందే దుందుభి అనే కుమారుడు ఉదయిస్తాడు. ఆ వసుదేవుడికే చతుర్బాహుడైన శ్రీమన్నారాయణుడు శ్రీకృష్ణుడుగా (వాసుదేవుడుగా) జన్మించాడు. ఆ వాసుదేవుడు మహావీరుడు, దాత, ఆర్త త్రాణ పరాయణుడు. బ్రాహ్మణులకు ప్రీతిపాత్రుడు, విప్రుల మీద ప్రీతి కలిగినవాడు. గిరివ్రజంలో నివసించే మగధరాజు జరాసంధుణ్ణి వధించి అతడిచేత బంధించబడ్డ రాజులందరినీ విడిపించాడు.

ఈ భూమండలంలో ఎదురేలేని వీర్యవంతుడు ఆవాసుదేవుడు. ఆయన సమస్త రాజలోకం చేత ఆశ్రయించబడ్డాడు. కాలక్రమంలో వాసుదేవుడు ద్వారకను రాజధానిగా చేసుకుని పాలిస్తాడు. లోకాల సృష్టికర్త అయిన బ్రహ్మను లయకారకుడైన నన్ను దర్శించాలనుకునేవారు ముందుగా వాసుదేవుణ్ణి దర్శించాలి. వాసుదేవుణ్ణి చూస్తే నన్ను (శంకరుణ్ణి) చూసినట్టే. ఓ తపస్వులారా! పరమాత్మ అయిన వాసుదేవుడికి ఎవరి మీద ఇష్టం కలుగుతుందో వాడిమీద ఇంద్రాది దేవతలకు కూడా ఇష్టం కలుగుతుంది. శ్రీకృష్ణ భగవానుణ్ణి ఆశ్రయించిన మానవులకు కీర్తి, స్వర్గం రెండూ లభిస్తాయి. పరమధార్మికుడైన వాసుదేవుడే ఇతరులకు సకల ధర్మాలనీ బోధిస్తాడు. ఇలా ధర్మాన్ని గురించి తెలుసుకున్న వారందరూ దేవతలకు ప్రభువైన వాడు, తనని ఆశ్రయించినవారిని రక్షించేవాడు అయిన వాసుదేవుడికి భక్తిగా నమస్కరించాలి. అలా చేసిన వాడికి సాక్షాత్తు వాసుదేవుడైన ఆ శ్రీకృష్ణుడి దర్శనం లభిస్తుంది.

మహాతేజోవంతుడైన ఆ వాసుదేవుడు, మానవుల శ్రేయస్సు కోరి ధర్మాన్ని ఉద్ధరించటం కోసం ఋషుల్ని సృష్టించాడు. ఆయన చేత సృష్టించబడ్డ సనక సనందనాది ఋషులు తపస్సుచేసుకుంటూ గంధమాదన పర్వతం మీద ఉన్నారు. ధర్మజ్ఞుడైన వాసుదేవుణ్ణి దర్శిస్తే ఆయన మనల్ని దర్శిస్తాడు. ఆయన్ని ఆశ్రయిస్తే మనకి ఆశ్రయాన్ని కలిగిస్తాడు. ఇంతటి పరమపవిత్రుడైన ఆ వాసుదేవ పరమాత్మని మానవలోకంలో సజ్జనులు ఎంతో భక్తితో కొలుస్తారు. ఆయన అనుగ్రహం కోసం తపస్సు చేస్తారు. శాశ్వతుడు సనాతనుడు అయిన ఆయన్ని దేవతలు కూడా పూజిస్తారు.

దేవతలారా! ఋషులారా! సర్వదేవతలకూ ఈశ్వరుడైన ఆ వాసుదేవుణ్ణి దర్శిస్తే సకల దేవతలనూ దర్శించినట్టే మహావరాహరూపుడైన ఆ పరమాత్మను నేను కూడా నిత్యం దర్శిస్తూవుంటాను. నాతో సహా సకల దేవతలూ ఆయనలోనే నివసిస్తున్నారు. కనుక ఆయన్ని చూస్తే త్రిమూర్తుల్ని చూసినట్టే. వాసుదేవుడైన శ్రీకృష్ణుడికి ఒక అన్న ఉన్నాడు. ఆయనే బలరాముడు. నక్షత్రకాంతితో ప్రకాశించే ఆయన నాగలిపట్టి భూమిని రక్షిస్తూ వుంటాడు. ఆయనెవరో కాదు వేయితలలతో వెలుగొందే ఆదిశేషుడే. ఆ ఆదిశేషుడే అనంతుడనేపేరుతో విఖ్యాతిచెందాడు. తన వేయిపడగలతో పాతాళలోకంలో నివసిస్తూ భూమినంతటినీ మోస్తున్నాడు. వాసుదేవుడైన శ్రీకృష్ణుడు, ఆదిశేషుడి అంశ అయిన బలరాముడు ఇద్దరూ పూజనీయులే. మీరందరూ ఈ ఇద్దరినీ భక్తి శ్రద్ధలతో అర్చించాలి. ఈ విధంగా వాసుదేవ మాహాత్మ్యం తెలుసుకున్నవాడు ఆయన దివ్యానుగ్రహాన్ని పొంది తరిస్తాడు.

## శ్రీమహావిష్ణు భక్తులు పొందే ఉత్తమగతులు

జగద్గురువైన వాసుదేవుణ్ణి విధివిధానంగా అర్చించినవారు ధర్మార్థకామ మోక్ష ఫలాలను పొందుతారు. ఆయన్ని త్రికరణశుద్ధిగా ఆరాధించే మానవులు దేవతలకు కూడా దుర్లభమైన వరాల్ని పొందుతారు. సర్వపాపహరుడు, సకల కామితాలనూ తీర్చేవాడు అయిన విష్ణువుని సేవించే మానవులు ధన్యులు.

బ్రాహ్మణ క్షత్రియ, వైశ్య, శూద్ర పంచమ వర్ణాలవారు కూడా మహావిష్ణువుని అర్చించే ఉత్తమ గతుల్ని పొందుతున్నారు. ఆ పుణ్యగతులు ఎలాంటివంటే!

విష్ణుభక్తులు నీటిబుడగలా అస్థిరమై, జరామరణయుక్తమై, రోగాలకి ఆశ్రయమై, మాంస రక్త మలమూత్రాది దుర్గంధాలతో కూడుకున్న మానవ దేహాన్ని విడిచి, సంకల్ప మాత్రంతోనే ప్రయాణించేది అయిన దివ్య గంధర్వుల సంగీతంతో కూడుకున్నది, లేత సూర్యుడులా ప్రకాశించేది అయిన దివ్య విమానాన్ని ఎక్కి వేరువేరుగా వున్న ఆయా పుణ్యలోకాలను చేరుకుంటారు. వారు ఒక్కొ లోకంలో ఒక్కొ మన్వంతరం కాలం సకల సుఖభోగాలు అనుభవించి, అక్కడి నుంచి దివ్యమైన అంతరిక్షలోకానికి వస్తారు. అంతరిక్షంలో పదిమన్వంతరాల కాలం దివ్యభోగాలను భావించి అక్కడి నుంచి గంధర్వలోకానికి వెళతారు. ఆ గంధర్వలోకంలో ఇరవై మన్వంతరాలు ఆనందంగా కాలం గడుపుతారు.

గంధర్వలోకం నుంచి విష్ణుభక్తులు సరాసరి ఆదిత్యలోకానికి చేరుకుంటారు. ఆదిత్యలోకంలో కూడా ముప్పై మన్వంతరాలు సుఖజీవనం చేస్తారు. అక్కడి నుంచి సకల సుఖాల్నీ ప్రసాదించే చంద్రలోకానికి పోయి నలభైమన్వంతరాలు, అక్కడి నుంచి ఇంద్రలోకానికి వెళ్ళి డెభ్భై సంవత్సరాలు ఇంద్రలోకం పైనున్న ప్రజాపతిలోకాన్ని చేరి ఎనభై మన్వంతరాలు జరామరణాలు అనేవి లేకుండా సమస్త భోగాలనీ అనుభవించి సరాసరి బ్రహ్మలోకాన్ని చేరుకుంటారు. బ్రహ్మలోకాన్ని చేరిన విష్ణు భక్తులు అక్కడ తొంభై మన్వంతరాలు సకల సుఖాలూ అనుభవించి తిరిగి భూలోకంలో ఉత్తమ బ్రాహ్మణ వంశంలో యోగులుగా వేద శాస్త్రాల్ని తెలిసిన పండితులుగా జన్మిస్తారు. తిరిగి క్రమక్రమంగా పైపైకి వెళుతూ ప్రతి జన్మలో నిండు నూరేళ్ళు జీవించి మరల దివ్యలోకాలకి వెళుతుంటారు. ఈ విధంగా పది జన్మలు గడిచిన తరువాత విష్ణుభక్తులు బ్రహ్మలోకం నుంచి దివ్యమైన వైకుంఠ ధామానికి చేరుకుంటారు. అక్కడ వంద మన్వంతరాలు అక్షయ భోగాలను భవించి జరామరణాలు లేకుండా వారాహమూర్తిలోకానికి వెళతారు.

వారాహమూర్తి లోకానికి చేరుకున్న విష్ణు భక్తులు, అక్కడ చతుర్బాహువులతో కూడుకున్న దివ్యమైన శరీరాన్ని పొంది సకల దేవతల నమస్కారాల్ని అందుకుంటూ పదివేలకోట్ల సంవత్సరాలు ముక్తి సుఖాన్ని అనుభవిస్తారు. అక్కడ నుంచి నరసింహలోకానికి చేరి అక్కడ కూడా పదివేలకోట్ల సంవత్సరాలు ఆనందంగా గడుపుతారు. ఆ తరువాత ఈ సాధకులు నారాయణ లోకానికి వెళ్ళి అద్భుదకోట్ల సంవత్సరాలు ఉండి దివ్యరూపాల్ని పొంది సురాసురల చేత స్తుతించబడతారు. నారాయణ లోకం నుంచి వారు బయలుదేరి అనిరుద్ధలోకానికి చేరుకుంటారు. పద్నాలుగువేల కోట్ల సంవత్సరాలు అక్కడ సుఖాలనుభవించి తమ తపఃశక్తితో సంకర్షణ లోకానికి వెళతారు. ఆ సంకర్షణ లోకంలో వేయి రకాల భోగాలనుభవించి మోక్షాన్ని పొందుతారు. అలా మోక్షం పొందిన ఆ విష్ణు భక్తులు జరామరణ రహితమైన వాసుదేవ పరతత్త్వంలో లీనమైపోతారు.

## అల్పశ్రమతో అధికపుణ్యం

దుర్లభమైన మానవజన్మ పొందిన వారు తమ జీవితంలో పుణ్యకార్యాలను ఆచరించి సద్గతులు పొందాలి. సహజంగా మానవులు దుర్బలులు. ఎక్కువ కష్టాలకు ఓర్చుకోలేరు. అలాంటి వారు అల్పక్లేశాలతో (కష్టాలు) అధికమైన పుణ్యాన్ని సంపాదించుకునే అవకాశం కేవలం కలియుగంలోనే వుంది. ఈ విషయంలో స్త్రీలు, శూద్రులు కూడా ఎంతో ధన్యులు.

యత్కృతేదశభిర్వర్షైః త్రేతాయాంహాయనేవతత్ ।
ద్వాపరేతచ్ఛమాసేన అహోరాత్రేణ తత్కలే ॥

తపసోబ్రహ్మచర్యస్య జపాదేశ్చఫలం ద్విజాః ।
ప్రాప్నోతి పురుషేన కలేసాధ్వితి భాషితుమ్ ॥

ధ్యాయన్ కృతేయజన్యజ్ఞైః త్రేతాయాం ద్వాపరేऽర్చయన్ ।
యదాప్నోతిక తదాప్నోతి కలౌ సంకీర్త్య కేశవమ్ ॥

*(శ్లో॥ 61-63, అధ్యా-220)*

కృతయుగంలో పన్నెండు సంవత్సరాలు తపస్సుచేస్తే వచ్చే ఫలితం త్రేతాయుగంలో ఒక సంవత్సరం చేస్తే వస్తుంది. అదే ద్వాపరయుగంలో నైతే ఒక మాసంలో ఫలితం కనిపిస్తుంది. కలియుగంలో నైతే ఒక రోజులో ఫలితం కలుగుతుంది. తపస్సు బ్రహ్మచర్యం, జపం మొదలైనవి ఆచరించటం వల్ల కలిగే ఫలితం కలియుగంలో అల్పశ్రమతోనే మానవుడు పొందగలడు. అంతేకాక కృతయుగంలో ధ్యానం చేయటం వల్ల, త్రేతాయుగంలో యజ్ఞయాగాలు ఆచరించటంచేత, ద్వాపరంలో అర్చనలు చేయటం వల్ల లభించే పుణ్యఫలం కలియుగంలో కేవలం కేశవనామ సంకీర్తనతోనే లభిస్తుంది.

## ప్రళయకాల సమయంలో మానవుల ప్రవర్తన

ఒకనాడు వ్యాసమహర్షి దగ్గరికి మునులందరూవెళ్ళి స్వామీ! ప్రళయకాలం దగ్గరలో వుందో దూరంలో వుందో మాకు తెలియటం లేదు. కనుక ద్వాపరయుగం ఎప్పుడు అంతమై కలియుగం వస్తుంది? ప్రళయకాలం సంభవించబోయే సమయాన్ని ఎలా గుర్తించాలి? దయచేసి తెలియచేయండి అని ప్రశ్నించారు. వారికి వ్యాసమహర్షి ఇలా సమాధానం చెప్పటం ప్రారంభించాడు.

మహర్షులారా! మనీశ్వరులారా! యుగాంతకాలంలో రాజులందరూ ప్రజల్ని రక్షించకుండానే వారినుంచి బలవంతంగా పన్నులు గ్రహిస్తారు. క్షత్రియులు కానివారు కూడా రాజులవుతారు. బ్రాహ్మణులు శూద్రుల్ని సేవించి జీవిస్తారు. శూద్రులందరూ బ్రాహ్మణుల ఆచారాలను పాటిస్తారు. వేదపండితులు వేదాధ్యయనం చేయటం మానివేస్తారు. సరిగ్గా మంత్రాలు చదవకుండానే హోమాలు చేస్తారు. శిష్టాచారాల్ని అసహ్యించుకుంటూ ధనమే ప్రధానంగా జీవిస్తారు. మద్యమాంసాల్ని అధికంగా స్వీకరిస్తారు. పరుల మిత్రుల భార్యల్ని అనుభవిస్తారు. దొంగలు రాజుల్లాగా, రాజులు దొంగల్లాగా ప్రవర్తిస్తారు. సేవకులు తమకి అనర్హమైన వాటిని అనుభవిస్తారు. ధనమున్నవాడికే గౌరవం లభిస్తుంది. మంచివారిని పరిహసిస్తారు. భ్రష్టులైన వారిని నిందించకుండా అందలమెక్కిస్తారు.

పురుషులు వివేకాన్ని కోల్పోయి స్వేచ్ఛావర్తనులై సంచరిస్తారు. విప్రులు శిఖని ధరించరు. పదహారు సంవత్సరాల లోపే స్త్రీలు ప్రసవిస్తారు. ఊర్లలో అన్నాన్ని అమ్ముతారు. వీధుల్లో వేదాలని విక్రయిస్తారు. స్త్రీలు మానాన్ని అమ్ముకుంటారు. బ్రాహ్మణులు శూద్రులలాగా మాట్లాడతారు. శూద్రులు తెల్లని దంతాలతో, తలల్ని గొరిగించుకుని, కాషాయ వస్త్రాలను ధరించి ధూర్తబుద్ధితో జీవిస్తూ ధర్మాలు ప్రబోధిస్తుంటారు. కుక్కలు అధికంగా వుంటాయి. ఆవుల సంఖ్య తగ్గిపోతుంది. గ్రామం చివర ఉండాల్సినవారు గ్రామం మధ్యలో, గ్రామం మధ్యలో ఉండాల్సినవారు గ్రామం చివర నివసిస్తుంటారు. బ్రాహ్మణులు తమ తపోయజ్ఞఫలాలను అమ్ముకుంటారు. ఋతుధర్మం తారుమారౌతుంది. రెండు సంవత్సరాల గిత్తతో నాగళ్ళు లాగిస్తారు. వానలు క్రమంగా కురవటం ఆగిపోతుంది.

దొంగలవంశంలో పుట్టినవారు రాజులవుతారు. రాజుకి తగ్గట్టే ప్రజలుకూడా అధర్మకార్యాలు చేస్తుంటారు. భూమి ఎక్కువశాతం చవిటిగా మారుతుంది. తండ్రిద్వారా సంక్రమించిన ఆస్తిని పంచుకోవటంలో కుమారులు లోభంతో పరస్పరం కలహించుకుంటారు. స్త్రీలు సౌందర్యం మీదే దృష్టి వుంచుకుంటారు. పురుషులు నిర్వీర్యులైపోతారు. అయినా భార్యతో సుఖించటమే పరమార్థంగా జీవిస్తారు. క్రమంగా పురుషుల సంఖ్య తగ్గిపోతుంది. స్త్రీల సంఖ్య ఎక్కువవుతుంది. యాచకులు ఎక్కువవుతారు. యువకులు కూడా వృద్ధులలాగా అలవాట్లను కలిగివుంటారు. శీలంలేని వారు ఎక్కువ సుఖాలనుభవిస్తారు. ఇసుక వర్షం కురుస్తుంది. పరలోకం అసలు ఉందా! అని సందేహిస్తారు. క్షత్రియులు వైశ్యులలాగా ధనధాన్యాల మీద ఆధారపడి జీవిస్తారు. బంధుప్రీతి నశిస్తుంది. ఋణాలని సక్రమంగా తీర్చరు. సంతోషం తగ్గిపోయి కోపం మనుషుల్లో పెరిగిపోతుంది. నరులు ఎవరికి వారే తామే గొప్ప పండితులమని అనుకుంటారు. ప్రతివాడు తాను గొప్ప కవీశ్వరుడను కుంటాడు.

బ్రాహ్మణులు వర్ణాశ్రమధర్మాలను ఆచరించరు. నక్షత్రాలు సరైన యోగాలతో వుండవు. రాజులు దొంగల్లా తయారవుతారు. యాగం చేయకూడని వారితో యాగాలు చేయిస్తారు. తినకూడని పదార్థాలు తింటారు. నక్షత్రాల కాంతి తగ్గిపోతుంది. దిక్కులు తారుమారవుతాయి. సాయం సంధ్యాకాలంలో దిక్కులు మండుతున్నట్టు కనిపిస్తాయి. పుత్రులు, తనకన్నాపెద్దవారైన తండ్రులకు, అత్తలకు పనులు పురమాయిస్తారు. బ్రాహ్మణులు నిత్య హోమాలను ఆచరించరు. నిద్రపోతున్న భర్తను మోసగించి స్త్రీలు మరొక చోటికి పోతారు. ఉపకారికి ప్రత్యుపకారం చేయరు. స్త్రీలు భర్తకి తగినంత సుఖాన్ని అందివ్వరు. ఈ విధంగా యుగాంతకాలంలో మానవుల ప్రవర్తన భిన్నభిన్నంగా రకాలుగా వుంటుంది.

## క్షర - అక్షర తత్త్వాలు

బ్రహ్మదేవుడి పగటి సమయంలో పరమాత్ముడైన నారాయణుడు సృష్టి చేస్తుంటాడు. రాత్రి కాగానే తిరిగి రుద్రుడి రూపంలో ఆ సృష్టిని తానే సంహరించి నిద్రపోతాడు. ఇదే విధంగా పగలు సృష్టించటం రాత్రిలయం చేయటం అనేవి ఆయన నిత్యకృత్యాలు. అణిమాది అష్టసిద్ధులకీ ఈశ్వరుడు, అవ్యయుడు, జ్యోతిస్వరూపుడు, అసంఖ్యాకంగా నేత్రాలు, పాదాలు, హస్తాలు కలిగి అంతటా వ్యాపించినవాడు, విశ్వాత్ముడు, ఏకాక్షరుడు, ముల్లోకాలనూ తన స్వశక్తితో ధరించువాడు అయిన ఆ పరతత్త్వ స్వరూపుడు, ఎన్నో రూపాలతో ఈ విశ్వంగా కనపడటంతో అందరూ ఆయన్ని విశ్వాత్ముడంటారు.

ఆ విశ్వాత్ముడు తనకు తానే రూపపరిణామాన్ని పొంది తనకు తానే ఒక ప్రపంచంగా సృష్టించుకున్నాడు. అప్పుడాయన్ని విరించి (బ్రహ్మ)అని మహతత్త్వం అని అన్నారు. ఈ మహతత్త్వమే శాస్త్రాల్లో బుద్ధితత్త్వంగా, హిరణ్యగర్భుడుగా చెప్పబడింది. ప్రజాపతులందరి చేతా నమస్కరించబడే ఆ మహాతత్త్వాన్ని (హిరణ్యగర్భుడు) అహంకార తత్త్వమని, అవ్యక్తం నుంచి వ్యక్తమైన విద్యా-అవిద్యా సృష్టి అని వివిధరకాలుగా వ్యవహరిస్తారు.

ఆ ఏకైక తత్త్వం (బ్రహ్మ) నుంచే చరాచర, విద్యా అవిద్య అయిన భూతసృష్టి జరిగింది. వైకృతమైన ప్రపంచం కూడా ఏర్పడింది. ఆ తత్త్వం నుంచి శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలనే తన్మాత్రలు, పృథివి, అప్, తేజో, వాయు ఆకాశాలనే పంచభూతాలు ఒకేసారి ఆవిర్భవించాయి. అలాగే మనస్సుతో కలిసి త్వక్(చర్మం) చక్షు(కన్ను) జిహ్వ (నాలుక) శ్రోత్ర (చెవి) ఘ్రాణ (ముక్కు) అనే అయిదు జ్ఞానేంద్రియాలు ఏర్పడ్డాయి. వీటితో పాటు వాక్ (మాట), పాణి (చేయి), పాద (కాలు), పాయు (మలద్వారం), ఉపస్థ (మర్మావయవం) అనే అయిదు కర్మేంద్రియాలు జన్మించాయి. ఈవిధంగా మొత్తం 24 తత్త్వాలు ఏర్పడ్డాయి. ఈ తత్త్వాలతోనే సమస్త ప్రపంచం, నరకం, యక్షులు, గంధర్వులు, భూతాలు, కింకరులు, ఉరగులు, దోమలు, ఈగలు, పురుగులు, కుక్కలు వంటివన్నీ ఆవిర్భవించాయి.

ఈ విధంగా పృథివి, జల, ఆకాశాలలో వుండే స్థిర చర రూపమైన ప్రాణులు, జడ, చైతన్య పదార్థాలు, ఏవైతే ఉన్నాయో! అవన్నీ ఆ పరమాత్మ రూపాలే. ఇది అక్షర అనగా నాశనం లేనిది. ఈ సమస్తం తిరిగి ఆ అక్షర పరమాత్మలోనే లయమైపోతుంది. కాబట్టి ఇది క్షర అనగా నశించిపోయేది కూడా అవుతున్నది.

## బ్రహ్మపురాణ ఫలశ్రుతి

ఈ దివ్యపురాణాన్ని బ్రహ్మచారులు, గృహస్థులు, యతులు కూడా శ్రవణం చేయవచ్చు. బ్రహ్మతత్త్వాన్ని తెలుసుకోవటానికి, ఈ పురాణ శ్రవణం చేయాలి. ఈ పురాణాన్ని శ్రద్ధగా విన్నట్లైతే విప్రుడికి విద్య, క్షత్రియుడికి యుద్ధంలో విజయం, వైశ్యుడికి అక్షయంగా ధనం, శూద్రుడికి సుఖభోగాలు లభిస్తాయి. మానవుడు శుచిగా ఏ కోరికతో ఈ దివ్యపురాణాన్ని వింటాడో లేక పఠిస్తాడో అతడు అనుకున్న కోరికలు తీర్చుకోగలుగుతాడు.

పురాణం వైష్ణవం త్వేతత్ సర్వంకిల్బిషనాశనమ్ ।
విశిష్టం సర్వ శాస్త్రే భ్యః పురుషార్థోపపాదకమ్ ॥

*(శ్లో॥20, అధ్యా-246)*

ఈ పురాణం విష్ణు ప్రతిపాదితమైనది. ఆయన్నే పరమదైవంగా ప్రకటించినది. సకల పాపాలనూ పోగొట్టి పురుషార్థాలన్నిటినీ ప్రసాదించేది. అన్ని శాస్త్రాలకన్నా గొప్పది. ఈ పురాణాన్ని వినేవారికి అన్ని రకాల దోషాలవల్ల వచ్చిన పాపం మొత్తం నశిస్తుంది.ఒక సంవత్సరం పాటు అగ్ని హోత్రం చేస్తే జ్యేష్ఠశుక్ల ఏకాదశినాడు మధురలో యమునాస్నానం చేసి శ్రీకృష్ణుడిని దర్శిస్తే ఎలాంటి ఫలితం లభిస్తుందో అదే ఫలితం ఈ పురాణ శ్రవణం లేదా పఠనం చేసినవాడికి లభిస్తుంది.

శ్రావయేద్బ్రాహ్మణోయస్తు సదా సర్వసుసంయుతః ।
ఏకాదశ్యాం ద్వాదశ్యాం చ విష్ణులోకం సగచ్ఛతి ॥

*(శ్లో॥ 28, అధ్యా-246)*

వేదంతో సమానమైన ఈ బ్రహ్మపురాణాన్ని పఠించినా విన్నా అతడు విష్ణులోకానికి చేరుకుంటాడు. ఏకాదశి, ద్వాదశి లాంటి పుణ్యదినాల్లో పండితుడైన బ్రాహ్మణుడిచేత ఈ పురాణాన్ని చెప్పించుకుని శ్రద్ధగా విన్నవారు కూడా విష్ణుపదానికి చేరుకుంటారు.

## స్వస్తి

**సర్వేజనాః సుఖినోభవన్తు**



